శ్రీ ర స్తు.

# వీరభద్ర న...

నెల్లూరుజిల్లా,

ఇం దు కూ రి పే ట

త్వరకవి - రామకృష్ణకవిప్రణీతము.





ఉప్పల - వీరన్న శ్రేష్ఠి అండు ... వారిచే

ప్ర క టి త ము.

చెన్నపురి:

చంద్రికా ముద్రణాలయమ...

19...

# …రబిధనాటకము

నెల్లూరుజిల్లా

ఇందుకూరుపేటనివాసియగు

త్యారకవి రామకృష్ణకవి ప్రణీతము.





ఉప్పల వీరన్న శ్రేష్ఠి అండు సన్సువారిచే

మదరాసు (చాకలపేట) నందు.

ప్రకటితము.

1930





శుభమస్తు.

శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాల కృష్ణపరబ్రహ్మణేనమః.

# వీరభద్రనాటకము



## పూర్వభాగము.

---

క॥ శ్రీరమణీధరణీవరు । శ్రీరమణీయాంతరంగ నీరజకుముద ।
శ్రీరవిశశిదృక్సన్మరాం । సారంగపాలహరి వేణుగోపాలహరీ ॥

వ॥ అవధరింపుము.

శా॥ శ్రీశ్రీనాథులు భారతీరధులుం గౌరీశంకరుల్ ప్రీతులై ।
సుశ్రేయంబుచిరాయురోన్నతుల సుశ్వాశ్వతంబొసంగ జగ ।
ద్విశ్రాంతంబగు కీర్తిసంపదల నుర్వింగృష్ణవంశబునకా ।
దశ్రాంతంబనుసూరిరంగవిభుసు బ్బాధీశడొప్పక ధరా ॥

వ॥ ఇట్లు వొప్పియుండె నెట్లనిన.

ద్విపద.

శ్రీమత్సమస్తధరిత్రీవిశేష । రామణీయైకసారంబుచేర్చికట్టి
గానిండభారతఖండవధూటి । తానాననముజూచుదర్పణంబనగ
భువనమోహనసింహపురి రాజ్యలక్ష్మి । తవిలి క్రీడించుసాధనగేహమనగ
పరికింపగ తెనుంగుప్రాజ్ఞాపీఠి । సిరివిడియించినసిబిరంబనంగ
దివ్యటమందాకినీతీరంబునందు । రవణమించినయఘరావతింబోలె
సురుచిరవిబుధేంద్రశోభితంబగుచు । జరరపినాకినీసాగరసంగ
మతటాంచలముననిర్మలభవ్యదివ్య । మతులమిచ్చోటనీయాదికాలమున
శరభసాల్వేశ్వరస్వామియు నీర । నరసింహదేవుడుసఖ్యులై ఖరుల
విడివడియన్యోన్యవికలంబుగోరి । కటుబోరుసల్పనక్కడికీశ్వరుండు
వచ్చియయ్యిరువురువైరముల్ మాన్పి । విచ్ఛేయుచు భోభక్తపతితి వేడగను

శివవీరభద్రదనృసింహులెచ్చోట | నివసింతురటమానితమైనయింపు
కూరిపేటననొప్పుచుండునచ్చోట | శాశ్వతోదీర్ణశర్వమనోరథము
స్వస్వప్రవర్ధితవర్షిష్ణులీల | దంగకబెంపొంపుతామరకొలను
బరికింప రెండవపాలసాగరము | నాగపున్నాగులంబనారతభూరి
భాగధేయోన్నతబరగునందులను | తరులవంపారిజాతంబుచందమున
గిరులలోపలమేరుగిరియిలబోలి | యనుసూరిలోకమట్లధిక విఖ్యాతి
ననువందెనయ్యుత్తమాన్వయమందు | ప్రబలినశ్రీమేడిపాలగోత్రమున
విబుధగోబ్రాహ్మణనీశ్వాసమొప్ప | నరులెన్న నసప్పనాయుండుబుట్టె
గరిమెనంబకనుకాంతసతండు | బరణితుడయ్యెనప్పరమయోగులకు
రవివంశమునబుట్టురామునిశేప | నవనిపైనొంటిప్రియాప్రతుమాడ్కి
శరనిధింబొడమినచంద్రునిబోలి | నరసింగప్పనాయుండుబుట్టె
నట్టిరంగపనాయుడఖిలలౌకిక | పట్టభద్రుండనిబరగుచునుండి
చెలువొందనాదిలక్ష్మియనుసతిని | బెలుచనుంకువజేసిపెండిలియాడ
రసికునిచతురునిరాజితకీర్తి | యశునిసమస్తవిద్యావిశారదుని
దానధర్మోదారతత్పరగతుని | మాననీయునిసనత్కుమారునింగాంచి
నతడుసుబ్బానాయుడననుతికెక్కె | సతతవీరేశప్రసాదితోన్నతుల
రాజిల్లెనాకృష్ణరాయునిబోలి | భోజునిరేవనెప్పుడుకవుల్ బొగడ
విక్రమార్కునిభంగివితరణమెరయ | వితరణంబునరుద్రవిభునిదచందమున
దివుటసీకలియుగదేవేంద్రుడనగ | వివిధభోగంబులవెలయుచునుండ
ధరణిపైవానకుబడియునివారు | బురుడింపరచిరశ్మిబొదవనివారు
కలిమిబలంబులఘనవితరణల | నేలసుబ్బారాయునెరుగనివార
లాసేతుసీతాచలాంతములేగ | యాసర్వసంధ్యనాకెవ్వరీడనగ
మునుసప్తసంతానములనేర్పరించి | రనుటయేకానిసుబ్బాధీశుడలరి
రచియించినటందురచియించరసగ | నచలితసంపత్తినన్నియొనర్చి
గృతిగోరంతవలంచికేవలభీతి | నతిభక్తివీరేశ్వరాలయంబందు
జేరికవీంద్రులుశ్రీవీరభద్రు | చారిత్రములుసారెసారెసజెప్ప
గావించుకౌతుకంబుప్పతిల్ల | కోవెలప్రాకారగోపురమంట
పారూఢయాగసాలాంతరాళములు | చామరధ్వజస్తంభక్రొత్త
తెరుయీమొదలయినదేవతాకములు | వారకవిస్తారవంతముల్గాగ



రమణులెంతోవింతరంగులనర్ప | సముకట్టితంగద్వైచార్యమానాయ

మానససమ్మోదవాఙ్మాధుర్యమొప్పఁ గ ననుబిలపించి సన్మానించి వేడుకనునిండు పేరోలగంబుండి మరియు.

సీ॥ ఘనులు పాటూరికిక్కనసోమయాజివంశజులు భారతరహస్యములు దెలుప ।
లిపిముఖ్యసరములంపినబూనిక్కగైకొని యాంగ్లేయరాజవేశ్యులు పఠింప ।
మునుపంచి మొదలిచ్చి మనుప వేయను మేటి - కోటీశ్వరకిరాటకోటిబలుక ।
వఘటితఘటనానసమర్థుండ రాయని - గడిపురగ్రామణుల్ కాచికొలువ ।
తే॥ సన్నుతోన్నతిలోకనాడునన్ను జూచి । యట్టులనియె మహాకవిపట్టభద్ర ।
శౌనకసగోత్రసుపవిత్రసచ్చరిత్ర । లోకవిస్తారనీతమాంబాకుమార ॥
సీ॥ మంగనామాత్యనామకమహాకవిపుత్ర - వరకవిశ్వరకవివంశవర్య ।
రామకృష్ణకవీశ్వరానీపుత్రివేణు - గోపాలదేవునిగూర్చినన్ను ।
పద్యకావ్యములు ద్విపదచరిత్రలు - యక్షగాననాటకకతకవచనంబు ।
చెప్పితివిభూప్రసిద్ధంబులై యుండె - నారయ శ్రీయిందుకూరిపేట ।
తే॥ వీరభద్రునిపై కృతి వెలయునట్లు । జేసి గేయప్రబంధంబు జేయవలయు ॥

వ॥ అని గోదానభూదానకన్యాదానపూర్వకంబుగా జాంబూనదాంబరాభరణాదులొసంగి కర్పూరతాంబూలంబు బెట్టి.

క॥ శ్రీరుచిరకళాభువనవి । చారునిపాటూరివంశకవిబుధైన ।
క్షీరాంబునిధివిహారుని । నారాయణగురుని నెమ్మనంబున దలతున్ ॥

వ॥ ఇట్లని దలంచి.

## షష్ఠ్యంతములు.

క॥ కరుణాచింతగుణమణికిన్ । సురుచిరకందేందుబింబచూడామణికిన్ ।
వరదైవశిఖామణికిన్ । చిరతరధీమణికిభక్తచింతామణికిన్ ॥
క॥ హాలాహలభక్షునకున్ । శైలాత్రిప్రముఖదైవజనరక్షునకున్ ।
ఫాలానలచక్షునకున్ । శ్రీలలితవిచక్షునకును జితదక్షునకున్ ॥
క॥ ముకుళితసురసురపలికిన్ । సకలబ్రహ్మాండభాండచయమాటా ।
టకమంత్రతంత్రకేళీ । ప్రకటితవిస్తారమతికిపర్వతపతికిన్ ॥

వ॥ అంకితంబుగా వాయుపురాణోక్తప్రకారంబున నాయొనర్పం బూనిన వీరభద్రవిజయంబను మహాప్రబంధంబునకు కథాక్రమంబెట్టిదనిన, నైమిశారణ్యపుణ్యక్షేత్రంబున యాగానుమోదులగు శౌనకాదులడిగిన మహానుభావుండగు వాయుదేవుం డిట్లని చెప్పందొడంగె.

# కథాప్రారంభము.

## గణాధిపతిప్రార్థన.

స్వదేశము - నాటరాగము - అటతాళము.

శరణుశరణుగణనాయకా - దేవ ॥శ॥ శరణుశరణువి శశిపావక భా - సురలోచనసురితవిమోచన॥ శ॥ సకలవిఘ్నకర సకలవిఘ్నహర - సకలసిద్ధిదాయకగణనాయక॥ శ॥ రవిసోములుదిశిభువిగలచుక్కలు - విని ధగతులనా కఫితమునిలుపుము ॥ శ॥ ఇందుకూరి పేటేలుమహేశ్వగ - నందకవిజనచందనజయజయ॥శ॥

వ॥ అనియిష్టదేవతాప్రార్థనంబుజేసి తదనంతరంబ క్షేత్రపాలకుండగు నాటకసూత్రధారుం డిట్లనియె.

## సూత్రధారునికథ.

దరువు. అస్యదేశము-హిందుస్తానికాపిరాగం-ఆదితాళం.

ఓహోహోసభజనులారా - యీయోగక్షేమమువిన్నారా॥సై॥ మోహారికులై దేహములందున - దేహము లెరుగకతిరుగుదురా॥ సై॥ సబాంధవముగా సకుటుంబముగా సభజేసియుమా సభనీ వేళను-ప్రబోధముగవీరభద్రవిజయము- బాగాజరుగునుచూడండీ॥సై॥ జ్ఞానరసాయకకబళమునకై - గానరసంబనుపానముగావున- నానాజనులానందరసైకా-ధీనులై మదిదెలియుండి॥ సై॥ సంగీతంబునుసాహిత్యంబును-సాంగముగావిని సకలజనంబులు - పొంగియిందుకూరిపేటమహేశుని- చెంగటముదమున జేరుదురు॥ సై॥ ఓ॥

ఉ॥ తొల్లియుగాదులందు భవదూరుడు చంద్రవిభూషణుండుమా ।
కల్లభుడాదినాయకుడు వాసవవంద్యుడు వెండికొండపై ।
యెల్లగణంబులుంగొలువనే పునపర్వతరాజపుత్రితో ।
సల్లలితాత్ముడైసకల సౌఖ్యదలంజెలువొందెసొంపుగన్ ॥

వ॥ ఇట్లప్పరమేశ్వరుండువిరాజమానరజతాచలశృంగాగ్రంబు ననేకరమ్యతలంబునంగొలువుండెనకొలువగమ్యరమ్య నిఖిలదేవతానిజకిరీటకిలిత దివ్యమణిప్రభాపటలదేదీప్యమానతేజోమహాభిరామంబును నగణితగుణగణాలంకృతంబును ననంతానసన ప్రీతిఫలితంబునై యొప్పుచుండెనాసమయంబునసప్పరమేశ్వరుండునిఖిలజనంబులనిజప్రభావంబున నానందకందళితహృదయారవిందులం జేయుచు మరియునిట్లనియె.



శివుడు దేవతలకు తత్త్వోపదేశము చేయుట.

మ॥ హరిలాభంబె సుఖీసుఖంబెయను నిత్యానందమే సెబుతీ ।
యిరవేవారిప మేలెమారులిసుఖంబెకిన్న రాధీశ్వరా ।
పరిణామంబె శివాశివంబెదృహిణా భావ్యంబుగోవింద శ్రీ।
కరమేసంయముబారలగంజభక్తశ్రేణికిశ్రేయమే ॥

వ॥ వినుండు సర్వజనంబులకు ధర్మార్థ కామంబులగు పురుషార్థంబులు మోక్షంబు పరమపురుషార్థంబు గావున మోక్షంబుసాధింపందగునట్టిమోక్షంబుసాలోక్యసారూప్యసామీప్య సాయుజ్యసార్ష్టివిదేహకైవల్యంబువలన నారువిధంబులై యుండందు సాలోక్యాదిచతుర్విధంబులు భక్తివలనను సార్ష్టిత్వంబు యోగంబువలనను విదేహకైవల్యంబు జ్ఞానంబువలనను పొందందగుగావున నారదాదులుభక్తియుక్తంబనియు కపిలాదులు యోగంబుముఖ్యంబనియు సనకాదులుజ్ఞానంబుత్తమంబనియును పొందిరిగావున నిందుకు మంత్రలయహఠరాజయోగంబులు కారణసాధనంబులయియుండుసందుమంత్రయోగంబనిర్వాచ్యంబగు దియేకాక్షరద్వ్యక్షర చతురాక్షర పంచాక్షరషడాక్షరాష్టాక్షరద్వాదశాక్షరాత్మకంబై సర్వయోగ నాభూతంబయి యుండునందు సత్తామాత్రంబు కేవలతారకంబు గావున॥

అన్యదేశం జాతిస్వరము-జంఝూటిరాగం-యేకతాళం.

ఈతారక మేతారకము-యిహపర సౌఖ్యాధారకము సీతాపతి పరిజారకణము-నేయుని కాశికనాటకము॥యీ॥ విశ్వస్థితిలయ కారణము. వేదోద్ధరణవిచారణము- శాశ్వతము సమాధారణము-సంస్మృతిదుఃఖ

వారణము॥యీ॥ అంతారామమయముజగము - వేదరహస్యమునిజము శాంతస్వాంతం సౌభగము - సత్యమనంతమనామయము॥యీ॥ యేమని చెప్పుదునిదిగోరి యిందుకూరిపేటను చేరి - నామైక స్మరణనుమీరి - నాలో గలతురకడసారి॥ యీ॥

గీ॥ శ్రీమదనుమూరవంశశ్రేణ్యులైన। సుబ్బారాయాద్రి సాధులసోకమతులు।
దీనిబారానూయణముజేయబూనిరవని। తారకము సర్వజనులకు తారకంబు॥

సీ॥ యేసుధావార్ధిలో నెసగుపహ్నిజ్వాల యానగనాపోజ్జ్యోతి యునగబరచు।
నేమహానభమున నెసస్థభూతము శ్రీమబ్రహ్మాండకోశమై బరగుచుండు।
నేమహోదకమధ్యసీమనారాయణ భ్యాతిహైరణ్యవిగ్రహముదనరు।
నేపుండరీకాఖ్య మిలవహ్నిశిఖమండలతీయకర్ణి కాలాళికంబు।
నీలతోయదమధ్యసన్నిహితవిద్యు। దాభనీవార శూకశ్శోభితాను।
పితనమై సదాళ్ళతిచేతబలుకు। నదియెతారకపరతత్త్వమనఘులారా॥

వ॥ యిదియిట్లుండనిచ్చున్నసేటిదినంబేమో విచిత్రం బావచ్చు వాడుదక్షుండు కాబోలుకయ్యంబునకు కాలుద్రవ్వెడువాడు నేనుమహాన ముద్రంబూనియుండెదమీరలతని స్వభావంబు నాలోకింపుడనుచున్న సమయంబున దక్షుండు శిష్యులతో నిట్లనియె

## దక్షప్రజాపతి కైలాసంబునకేగుట

ద్విపద॥ వోశిష్యులారమహోన్నతులార-వాసి గానేబంధువర్గంబుజూడ - బోయివ చ్చెదకానిపోలుపొందమీరు - నాయనగురునిల్వ నానావిధముల - కాగలకార్యభాగంబు లందేమి-మాన్యహాకృత్యధర్మంబులందేమి బద్ధారా - గులై పాఠాదులందు - శ్రద్ధతోజ దువుచుజరుపుడీవేళ - నేధర్మరాజుమందిరము నకేగి - యాధనంజయునిగేహమునకుబో నే - కావించిపిత్ర్యలోకంబు బెట్టుకొని - ప్రేమనాయాచోట్లబిడ్డలజూచి - జామాతలను గాంచిసౌహృదులైన - జామనుచంద్రసందరసవీక్షించి - వేగంబెవచ్చెదవినుడాశివుం డు - లోగచేయుమేలుంకజూడడగునె - విషయభోజనాదిదుర్వ్యసనయములకూర్మి - విషయం బు సరసంబు నిరసంబుగాదె.

వ॥ అనిమరియు నిట్లనియె.

స్వదేశము - యదుకులకాంభోజి-అట

సరసమేబహువిరసమాయెను - నాప్రకోపమునా - హరుడుతోలు తకలతబూనెను॥ స॥ హరుడునాపైయలిగిపోయెను సరతమన్యోన్యవిరో ధమేలను - పరివిధములను॥స॥ లేసిపోసికలిమిబలిమికి - మురియుడమేగా ని - తాను సేను జేసిన చెలిమికి. మానహీనమైనమాటలు - తానంటే నేనంటి నిగాని - హానివృద్ధులెరుగకుందున.. యిద్దరిసందున॥సరస॥మాటిమాటికి జగడమేలను - నాడేయిందుకూరి - పేటశివునినడత దెలిసెను - నాటిపగ

మదినాటిమమ్మెన్నో మాటలన్నా మానెనిదిగాక-మాటనిలుచునుపూట గడచును - చూడజూడగను॥ సరస॥

వ॥ అని కైలాసమార్గంబుబట్టిపోవుచు.

ద్విపద॥ ఈమహాకైలాసమేమివిలాస- మామందరాద్రిహీమా మాదిహేమాద్రు లయిననుసరిబోల వనిజెప్పవచ్చు-నేనగో త్రముజూడ నేగినఘోర - పాపకర్మంబులుభస్మమైపోవు-నేపర్వతాధిపునీక్షింపుదుః ఖ- రోగాపమృత్యువిరోధము ల్వాయు- నేరికిందలపోయనిహపరంబు లను- దండిసౌఖ్యంబులెంతయుగల్గునట్టి-కొండనవెండికొండయుగాదె.. యలఘుపర్వతమహత్వంబెవర్ణింప - నలవిగాదటపర్వతాధిపుడైన-శివు నిమహత్యంబుజెప్పతరంబె॥

వ॥ అని మగియునిట్లనియె॥

మణిరంగురాగము-త్రిపుటతాళము.

శివునిజూడబోవలెరా- భవునీబిలచిరావలెరా॥ శివుని॥ నవనార దాదీక్షితుని- సచ్చిదానందమయుని॥ శివుని॥ నిఖిలలోకాపాయకుని నియమితాశేషానాయకుని॥శివుని॥ వాటమైనయిందుకూరిపేటకుజేరియీా సారి॥ శివుని॥ వ॥ అనికైలాసంబునకేగుచు మరియు నిట్లనియె.

ద్విపద॥ఆమహేశుండుమాకల్లుడెట్లనిన- ప్రేమమీరగబిలచిబిడ్డ నిచ్చితిమి-కాకున్నమేమేడకైలాసమేడ-జోకతోనీశివునిజూడడమేడ- నక్షయుడయినవానివినియాడది- భిక్షునకేనుబిడ్డనిచ్చితిమొ-యొకయజ్ఞ మునకుమేముభయులమేగితిమివెనుకబడితిమదేనాటనుండి-వారికిమాకు నువైరంబెకాన-కూరిమిలేదులోకులువినరాదు-గాకున్నబిడ్డలకన్నమా బోట్లు- పోకున్నరాకున్నబుయిలోడుగాదె - మహనియ్యమూర్తి-యి న్నిమాటలుబల్క నేమిటికిపుడు- యెన్నటికయిననుహితమెసాధనము- కంటిరేహరునిసాత్వీక మహేశ్వరుని॥

శ్రీరాగము-యేకతాళము.

శ్రీపరతత్వరజితగిరి నిలయుండితడేరా- భానుకళానిధిపావకలో చనుడితడేరా- హరుడితడేరా- విశ్వస్థితిలయహేతువిచారణుడితడేరా- శంభుడితడేరా- భావాభావాభావాతీతుండితడేరా- భవుడితడేరా- ఇందుకూరిపేటదరిగెడు శివుడితడేరా- యుద్రుండితడేరా॥ శ్రీపర॥

వ॥ అని మరియును॥

ఉ॥ అర్ధిగశంకరుండువినయంబుననాకెను రేగుదెంచినా ।
పెద్దరికంబెఱింగి తగు పెద్దరికంబొయించు కైనతా ।
గ్రద్దనజేయుడయ్యెమన గారియమన్నన జేయడయ్యెరో ।
పెద్దలునవ్వరా త్రిమునిబృందముచాన్నునజేసెగంటిరే ॥

వ॥ సకలభూసురసమక్షంబున సావిత్రీసమానయగు నస్మత్తనూజను సతియనుదానిని మర్కటలోచనుండు పాణిగ్రహణంబు సేయుట జేసి దిక్పాలురతో యశోహానికరుండగు యీసిగ్గుమాలిన క్రియాశూన్యపరుని చేత సజ్జనాచరితమార్గంబు దూషితంబయ్యె నిదియునుంగాక.

గీ॥ శిష్యుడునాశిష్యభావంబుజేయుడాత్మ । దలచిప్రత్యుద్గమాభివందనము తెలమి ।
నడుపకుండినమా సెవినతుడుగాక । నోటిమాటకుతనకేమిగోరువోయె ॥

శ్లోకం॥ 'ఆవాహనంనజానామి నజానామివిసర్జనం' బను న్యాయంబయ్యెనని దక్షుండు క్రోధతామ్రాక్షుండై ఫాలాక్షునుద్దేశించి॥

అన్య దేశ్యము-పూరికల్యాణి రాగము- యేక తాళము.

పలుక వేమి రాశివా పలుక వేమి రాశివా॥ ప॥ పాప మేమి జేసితి రా-పిలచిబిడ్డనిచ్చి యెంత చులకనైతి రాశి వా॥ ప॥ పిన్న పెద్దల కొద్దిగొప్పలయెన్న నెఱుగడయ్యెయో కన్ను మిన్ను దెలియక నీవున్న వేమి రాశివా॥ పలుక॥ నేటికి చునచుట్టరికము తోటిపుణముదీరెరా నోటిమాటనైతము యీపూట తోసరి రాశి వా॥ ప॥ యెందుకైనపిలువక యొక్కరింటికిపో రాదు రాయిందు కూరిపేటసుజనులందరెఱుగ రాశి వా॥ పలుక॥

వ॥ అని సభాసదులనాలోకించి.

సీ॥ అనయంబుసుక్రియాకలాపుడు మానహీనుడు మర్యాద లేనివాడు ।
మత్తవాడున్మత్తనాగుండు ధూళిలిప్తుం డస్థిభూషణుండు ।
నష్టశౌచుండునున్మత్తనాగుండును దుష్టహృదయుండునుగ్రపతితభూని ।
కేతనుడువీథులబ్రుకేశశుచి । యైనయితనికి శివనాముడను ప్రవాద ।
మెటువగలిగె శివుడగునితనికెన్ని । యొగి వేదంబుకూతుననకిచ్చినటుల ॥

వ॥ వీనికినస్మత్తనయను విధిప్రేరితుండనై యిచ్చితినని శపింపదలంచి.

క॥ ఇతడిందోపేంద్రపరి । వృతుడైచుఖసమయముల హవిర్భాగముద్దే ।
వతలంగూడగమహీతని । యతిభాందకయాగు గాక యవనీస్థలిని ॥

వ॥ అట్లుగుటంజేసి శీఘ్రంబున మేషముఖుండ గానయ్యెదవని నందీశ్వరుండు ప్రతిశాపంబిచ్చె నంత నిజపురంబునకు చేరవచ్చు ప్రాణనాథుసంగను దక్షుండెంచు బోయెనోయని ప్రసూతి జేని చింతాక్రాంతయై యంతఃపురంబున నాతర్యులగు కాంతలతో నిట్లనియె.

## ప్రసూతివిరహము.

సీ॥ ఆలోకమందు సౌఖ్యంబుదయ్యెమెరుంగు నీలోకమునకష్టమెక్కడేరయ ।
తోబుట్టు తల్లిదండ్రులయాజ్ఞకొన్నాళ్ళు అన్నదమ్ములయాజ్ఞకొన్నినాళ్ళు ।
పాలిబోనియత్తమామలయాజ్ఞకొన్నాళ్ళు కొన్న మగనియాజ్ఞకొన్నినాళ్ళు ।
దలపోయ కన్నబిడ్డయాజ్ఞ కొన్నాళ్ళు కోడండ్రయాజ్ఞ లోకొన్నినాళ్ళు ।
బిరగమునుదాడుబెట్టినపశువుబోలి । యేస్వతంత్రంబెరుగుక నెగ్గుమాలి ।
చెడునుమోహాలనుచిక్కుబడుటకంటె । కానలకుబోవుటే మేలుమానవతులు॥

వ॥ కావున॥

స్వదేశ్యము-దరువు - శంకరాభరణము - అటతాళము.

మనసునిలుపజాలనే ఓలలనా-నామనసునిలుపజాలనే-మనసుని లుపజాల మదిరాక్షియీ వేళ-మనసిజుండిగు రాకుదూపులుమరిమరీ య దగాడనేసెనే॥మనసు॥ వెదకీమారుడేసెనే- చందురుడెంతో వేపివెన్నెల గాసెనే- కదసికదసిచల్ల గాలిపైబడెనల్ల కొదమతుమ్మెద జాడలువింటె గుండెఝల్ ఝల్లుమనెగదె॥మనసునిలు॥ కలికిచిలుకలుగూసెనే- బలు మారుకోవెలనా కూతురా జగన్మాతగాని-లోకులనడవడి లోనిదిగాదు। మాయలునమ్మామాయనుగూడి- మాయలోజిక్కినిలలుసందడిజేసెనే- వలపుమిక్కటమాయె వరుడిందురాడాయె - తెలియరాదిది మోహావా రిధిని గలసిపోవలసినట్లాయెను॥ మనసు॥ లలనయేమిచేతునే-నాప్రాణ- వల్లభుని యెన్నడుజూతునో - పిలువనిందుకూరి వేటకేగినసామి-పిలచిన పిలచినరాక బిగించుకున్నాడలిగెనోతొలగెనోచూడవే॥ మనసు॥

వ॥ అనియిట్లు మహావిరహదోధూయమానమానసయయి॥

సీ॥ కానఁజొకమ్రినఁగాబుట్టినామేలు భూమిపైతూషుడై బుట్టరాదు ।
బుట్టెపోవియ్యంబు పొందుచూతామంటె సిరిగలయత్తిల్లుదొరుకబోదు ।
దొరికెబో తినిచునెకరముప్పుదామంటె చక్కనిపెనిమిటి చిక్కబోడు ।
జిక్కుబో పరిచర్య సేయుచుందామంటె కులగాంతపై ప్రేమనిలుపబోడు ।
నిలిపెబో మంచిసంతతిగలుగుటరుదు।గలిగెబో మనమాటలోనిలువబోరు ।
నిలచిరావచ్చుకోడండ్రుకులువలాదు। రాబాడుజన్మంబు బురాయిమైనమేలు॥

వ॥ అనిదక్షునిరాకరించి వేగింపుచున్న సమయంబున దక్షుండువచ్చి యిట్లనియె.

క॥ రావెమదగజగామిని । రావె నేనెన్నడెరుగరానిమహాత్మా ।
పా వేశ [illegible] ॥

## ప్రసూతి దక్షుల సంవాదం.




వ॥ అనిన ప్రసూతి యిట్లనియె.

స్వదేశ్యము- దర్వు-భైరవిరాగం-ఆదితాళము.

కోపమేమిప్రాణనాయక నేడెన్నడులేని॥ కోప॥ పాపకారులే పట్టునవెవరె-లోభము జేసిది తాపమురాని॥ కోప॥

వ॥ అనిన దక్షుండిట్లనియె.

మాటవినవెప్రాణనాయకిసౌఖ్యదాయకి॥ మాటవినవే॥ బోటిరో నాటికి నేటికి సెలవి-పూటదిగంబరివీటికిపోయిన॥ మా॥ ప్ర॥ యేలబోతిరే యేలబోతిరి - మనకూతురల్లు డేమి జేసి రేమి జేసిరి-వాలాయముమనవా రెండై-నామేలై యుండెచాలుగదా- మీకోడల యెందుకైనమాటెఖార మాయికనైనవినుము- యిందుకూరిపేటేదూరమా- కుందెదవదినీకూతు రుగాదే-మందువాడునా యల్లుడుగాడే॥మాట॥

ప్ర-గీ॥ జాలిపడుచుమిగులసారెకుగుందుచు। చిన్నబోయి మొగముజేవురింప।
నింతమాత్రముకుజింతింపనేటికి । బ్రహ్మకేమికాదువ ప్రాణనాథ!

ద-మత్తకోకిల॥ మాపుమామగదాయాతం డనిమన్ననల్దగజేయడే।
లోకనాథుడనంచుగర్వములోలతక్బడియున్నవా।
డేకతంబున నేను జెప్పుదునింతికోవిమనాకునుక్ ।
నీకుకూతురుఅయిన గౌరియానికన్నమేమియుబల్కదే ॥

వ॥ కోమలీకొండవీటి జంగమువాడు కేవలతామస గుణాతిరేకి గాని సత్వగుణప్రధానుండు గాడని నేడేరూఢిగా దెలియనాయెను॥

ప్ర-ద్విపద॥ప్రాణేశనినుబిల్వబంపకమున్నె-ఏణాంకమౌళింటికేం దుకుబోతివయ్య - నెయ్యంబుకయ్యంబు వియ్యంబు - దయ్యంబుకైనను

దగియుండవలయు - సింధుగంభీర నేజెప్ప నేమిటికి- బంధువిరోధ మేర్పడ జేయరాదు- మానవులకు జాయమానంబుజూడ-జానంబెతుప్తి యజ్ఞానంబునష్టి-కలిమిబలంబెంతగలవారికైన-బలవద్విరోధ మొప్పదురి త్తబోదు-తానుకొందరకుబాధకుడగు నేని- తానునుబరులచేతను గష్టపడును సర్వజ్ఞదక్షప్రజాపతుల్మీరు - పూర్వవిరోధముల్పొ నేర దేమి-భూషించి రరయుచుయుప్పొంగెద రేల- దూషించిన రన్గుంద నేమిటికి- దూషణ భూషణాదులుమన కేల - రోషంబు లేలవిరోధంబు లేల - ననుసూరిసుబ్బరాయుడు మొదలైన-జనులకీమాటలాశ్చర్యంబులనఘు॥

ద-వ॥ కామినీ నీవు వ్యష్టిమాటలువిడచినసమష్టిమాటలాడెదవు మాబోటివారికీమాటవలన మనోవ్యాకులంబుదీర నేరదు॥

మత్తకోకిల॥ గానయిందుకు దీనికిన్ బ్రతికారమే నొసరించెదన్ ।
పూనిశేసెదనొక్క-యజ్ఞము బూజశేసెదకేశవున్ ।
మపునులున్ వసువుల్ సుపర్వులు మర్త్యులున్ గ్రహరాజులున్ ।
మానినీచనుదెంతు రిచ్చట మాటమాత్రమ బిల్చినన్ ॥

అన్యదేశ్యము-దర్వు - హిందుగాంధారి-ఆదితాళం.

ప్ర॥ అతడాది దేవుడునీకువిరోధుడు । హానివృద్ధు లేలాగానో॥అ॥ చతురుడవై తేయజ్ఞము జేసి। సాధించుము । నీధైర్యము బాసి। యితఃతరమై తేమెందుకుగాసి। యేమి యోచన జేతువోగాసి॥అ॥ సంగతి తెలిసియరాని। జంగమువాడనిదలతువుపూని। యింగితమేనీ వెరుగుదువేని। యేమని యోచన జేతువోగాసి॥అ॥ బూటకిమాటవినుదు।యిందుకూరి పేటకువీలే శుభముచు జేరి । నేటికికలహమును మానడీసారి। యేమని యోచన జేతువోగాని॥అ॥

వ॥ అనిన దక్షుండు విరోధాభ్యాసంబుగా నిట్లనియె.

సీ॥ కట్టంగచర్మబుగాని చీరలు లేవు-పూయగంధము లేదుభూతిగాని ।
కాలకూటమెగాని కంఠమాలిక లేవు-ఫణి గాని పెట్టభూషణము లేదు ।
పలివాకసమెగాని తల వెంట్రుకలు లేవు-తలకు వూలేదవి నెలకుమించ ।
వెడదవుగ్రయగాని కుడువకచంబులె-దెక్కగుఱ్ఱము లేదెద్దుగాని ।
మూడుమూర్తులందు మొగినెవ్వడుంగాడు। జాతి లేదుపుట్టుజాడ లేదు ।
పరుకదొంటిగాడు బ్రహ్మదు లెరుగరు। తిరుగజోగివాడు దేవుడగునే ॥

ప్ర-ద-సంవాదము-దర్వు - స్వదేశ్యము-ముఖారి-జుల్వ.

ప్రాణేశ విరోధము లెడబాయవు మంచి జేయువు - ఏణాంకవిరోధి మంచినెంచునే కలహించునే ॥ప॥ ధయమునుడిగులొంద నేల- భాష్మి

హంసగామిని-జయకాలముమనకు కీడు-జరుగదు నేనెరుగుదు- భయభం డనజనములమిత - చండప్రచండులుమండలు-గండరగండలసదృశులవి దలతురునినుగెలుతురు॥ ప్రా॥ శైవులువైష్ణవులగెలువ-జాలరుసరిబోలరు- వావిరిసురులందరుమన-వారలుబహుశూరులు- నందికేశ్వరాదులుగణ నాథుబహుయోధలు - యిందుమాళికేవలపరమేశుడుజగధీశుడు ॥ ప్రా॥ గణనాథులుప్రేలువంచ - గలరటె అంతబలురటె - అణిమాదులుమ నవశవర్తు - లగుదురు మనకేతగుదురు- భయ-మెందుకుశివనిందహాట మేలనుచాల్ చాలును-యింనుకూరిపేటను శైవులందరునవ్వుచుందురు॥

వ॥ అనిపార్వతీమహేశులుమనకుం గూతురల్లురవుటం జేసి సర్వ స్వతంత్రులుగావున యజ్ఞంబునకు బిలుచుటయు క్తంబనిననించుక కోపిం చిదక్షుండిట్లని యె.

గీ॥ పిలువదగినవారి పిలుచుటధర్మంబు । బిలువరానివారిబిలువరాదు ।
పిలువనేలయున్న పిలచినబలుకని । ప్రౌఢుశివుసకలిమి మొదటుచెలిమి॥

వ॥ గావుననీవు ఇంటికడనుండు మేనాయాగంబు జేసికొనిమెదనని పౌరుషంబుదోషఁ దనశిష్యులంజూచిమీరు నేడు మొదలురుద్రకంకుగా దక్షుండు బృహస్పతీసవననామకయజ్ఞంబు హిమాచలబున సేయ నా రంభించె గావున శివుండును శివసంబంధులైన కేవలశుద్ధపాషండులును రాకుండునటుల నెల్లలోకంబులవారిని ప్రత్యుత్తానాభివందనంబులు జేసి సకుటుంబకరివారసమేతంబుగా రావలయుననిపిలచిశీఘ్రంబున రావలయు ననిన వారలట్లజేసినంత దక్షుండు యాగదీక్షుండై యరుదకంబుగాసకల జనసమేతుండైహోమంబు జేయుచుండెనదివిచారించివిమర్శించినారదుం డుకైలాసంబునకువచ్చి దాక్షాయణియున్నయంతికంబుజొచ్చిఇట్లనియె.

అన్యదేశ్యము-దర్వు - హిందుస్తానిభైరవి-ఆదితాళం.

దాక్షాయణీదాక్షాయ-దాక్షాయణి పరమేశ్వరీ-సాక్షాధీశ్వరీ- జయతుమహేశ్వరీరక్షింపుము- వారణచర్మాంబరీ॥ దా॥ నినుగోరిభజిం చినవారల - నీవనయముబ్రోచెదవనివినుతించెద ॥ దా॥ వరారోహనా మొరాలకించుము-సరోజదళలోచనిభవవిమోచని॥ దా॥ అకారవుకార మకారరూపిందుకూటిపేటాంబికామహేశ్వరీ॥ దా॥

వ॥ అని మరియు నిట్లనియె.



నారదుండు కైలాసంబునకు వచ్చుట.

క॥ వినవమ్మ దాక్షాయణి । నను మతిదయయుంచి వందనము గైకొనుము ।
ననవరత సురవరార్చిత । వనజాయత నేత్రమందవారణగమనా ॥

ద్విపద॥ ఓజగదంబ నీయుల్లంబునందు । యోచన బహుసేయుచున్నావదేమి । కిందెఘుంటిం చెన్నిక్రియనుండనేల। నంచగామిని మదికాయాసమేమి। తరుణి నీయమ్మటిదయ నెందుబోయె। మర్యాదేమాయె మా యేమాయె। పరికింపచంద్రబింబము బోలు మోము । విరగంది మెయిదీగె పసవాడుటేమి వాణీరం బెసచీ స్వాహాదిపతుల। నేణాయతాక్షి నేనిపుడె జూచితిని। కొమ్మనీకంటె తక్కువగా తలంప । నమ్మగువలె యెక్కడనవచ్చు నిపుడు। మోమాటమేమి యేమో కీడు శీఘ్రి। మేమహినొందెదు మెలతచందమున। గనుకట్టుచున్నావు గారికల్యాణి। యనుపమోన్నతినొందునటులుండ లేదు। నిజమాడినందుకు నిష్ఠురంబేమి। గబిబిజిబడెదివిక కపటమేమిటికి। మొన్న దక్షుండు నుముక్కంటికొన్ని । కొన్నిటగలహించికొని రనివింటి ॥

వ॥ ఇదియునుంగాక నేను మీతల్లిగారింటికిం బోయి వచ్చితి నచ్చటివృత్తాంత శేకాంతింబున కొంత యెరిగించెద నవధరింపుము.

శా॥ తల్లీ మీజనకుండు దక్షుడు మదోద్రేకప్రేరితస్వాంతుడై ।
ఫుల్లాంభోజదళాక్షి తత్వము తలరింపక లేక వెల్వెట్టికో ।
జెల్లింపక సమకట్టినాడు మిము రా జింతింపడెం తేనియుంక ॥

వ॥ అట్టి యరుదకంబయిన యాగంబు జూడరోసి నేను వచ్చితి నక్కడికి ముల్లోకంబుజనంబులు లంబాలురంజిలవచ్చియున్న వారు మీచెల్లెంద్రును వారిమగలు [illegible] మీతల్లిదండ్రులు నబృహస్పతిసవననామక

యజ్ఞమహోత్సవంబుననున్నవారు మిమ్ముఁ వెలిబెట్టుట నీకు తేటపడ నెరిగించితిని నింక నేనుబోయివచ్చెదననిన విని దాక్షాయణి దక్షపారాక్షుల పరోక్షవైరంబు లుపలక్షించి తనమనంబున నిటులవితర్కించె.

### సతీదేవి పశుపతి నాలోకించుట.

ద్వి॥ అలివేణి దక్షునిమాట కేమిహాటము। కలిగికయ్యమునకు కాల్
ద్రవ్వనకట।సుమతిమాతల్లి ప్రసూతిదక్షుండు। మమ్ముగన్న తండ్రికొమ్మవా
రలకును। పదునార్వురము మేము బాలలముర్వి। నుదయించితిమి వినుండున్న
దున్నటుల। కలకంటినిక్కము దాపనేల। తెలియజేసెద సతీదేవి నాపేరు.

స్వదేశ్యము-దర్వు శ్రీరాగము-ఆదితాళము.

మందయానా మందయానా ఓ సుందరయానా యెంతుబోదు నెం
దుబోదు నేమిసేయుదును॥ మం॥ చెలియా నాకదమాని జెప్పిపోయినమాట
ఫలమే మోనా యోగలమే మోగదవే॥ మం॥ వొకనాటిసుఖమది- యొక
సౌఖ్యమట వేశుక వాణిమనవారిని-నికనమ్మరాదె॥ మం॥ ననభోణిమరికొం
దరి మనసేమోతీర తనవారని మనవారనిదలపోయరాదె॥ మం॥ చలమో
యిందుకూరిపేట- శివునికృపలేక- యెలకాలమిటులాగా నేలాబుట్టితినే॥

వ॥ యిటులావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియు దృష్టియుబుట్టియు క్రియయు నున్నతియు మేధయు తితిక్షయుహ్రియు మూర్తియు శ్రీయు నను నామంబులుగలపదను స్వారసు ధర్మరాజునకిచ్చె-నొక్కకన్యక నగ్ని దేవునకు-నొక్క తెంబితృలకునిచ్చె-మరియు జన్మమరణాదినివృత్తుండును మహానుభావుండును దేవదేవుండగు మహాదేవునకు నన్నిచ్చివివాహంబు జేసె-నంతకొంత కాలంబునకు శ్వశురుండగు దక్షునకు-జామాతయైన వామదేవునకు-తొల్లి బ్రహ్మసులు జేయు సత్రయాగంబునం దన్యోన్యవిరోధంబులుగలిగి చిరంకాలబరగె నంత దక్షుండురుద్రహీనంబగుయాగంబు లేనిదియైనను యీశ్వరుతోటిపూర్వ విరోధంబున పరమేష్ఠికృతంబయినసకలప్రజాపతి విభుత్వగర్వంబునం జేసి బ్రహ్మనిష్ఠులగు యీశ్వరాములధిక్కరించి యునకుద్రకంబుగ వాజపేయ సవనంబు గావించె తదనంతరంబయిపుడు బృహస్పతి సవననామకంబైన యజ్ఞంబుసేయ నుపక్రమించినాడని నారదాములు జెప్పిరిది మకామున దవలోకనార్థంబు దేవదానవగరుడగంధర్వ యక్షరాక్షసకిన్నరకింపు

గుహ సిద్ధవిద్యాధర భాస్వరమునీశ్వర ప్రముఖులనేకులు సకుటుంబసమే తులై విహాయసవీధిం జనుదెంతు రదెజూడుమదెజూడుము.

స్వదేశ్యము-దర్వు-ఆనందభయిరవి-అటతాళం.

చూడరెమాటలాడరె చెలులార వేడుక॥ చూ॥ చూడరె చూడరేయ చ్చరలాడిరియాడిరేపాటలు- పాడిరెపాడిరె గుంపులుగూడిబంతులువీసి పోవుట॥ చూ॥ హితులుపౌరోహితులు యతులాశ్రితులు మునిసంతతులు మానవపతులుతగుబహుమతులుగై కొనిసతులుపతులునుసుతులువచ్చు ట॥ చూ॥ నేనునావిభుడైన శివుడును సూనుడయినగజాననుడునుబూని పోవలెనంచునామనసెనదిందుకుప్రాణనాధుని॥ చూ॥ పొలతియేనూరా కుండ నయిననుబోయియజ్ఞము చూడవలెనట బిలచు టేమని యుందు కూరిపేట నందరుబలుకుచుందురు॥ చూడరే॥

వ॥ ఇదియునుంగాక పామరుండగు మాతండ్రికిని పరమేశ్వరుండగు నాప్రాణనాధునకును కలకాలంబుకలహం బెట్టిపసంబయ్యెనని మరియును.

ద్వి॥ వలనొప్ప రేనియవ్వరి చెప్పి వారి-లఘుత రానందమది యెట్టు లనిన-వారిభక్తికొలంది వారుండలేక - వీరిశక్తికొలందివీరుండలేక-వైరంబు బెంచిరెవ్వరుదీర్పగలరు - వోనాజయాపజయం బేర్పడక - గాని యొండొరులుమార్గంబులుమాన- రిట్టికార్పణ్యం బే యునవచ్చు- పుట్టినిం డ్లకదాపొలతులకాస - ప్రాణనాధుని చెట్టబట్టినది మొదలు - యేణాక్షి పుట్టింటివృత్తాంతమెరుగ- నేమనునోయింక నేబోదుననిన- యేమిగోపించు నోయేమిసేయుదునె॥

వ॥ అని మరియు నిట్లనియె.

అన్యదేశ్యము-హిందుస్థాని-కాపి-అటతాళం.

లలలా నామదినిల్పగలనా-చిలుకలకొలికి నేనొంటిబోగలనా-రాగలనా॥ వోలలనా॥ పలికిపలుకడిదే మొపదరె-పలచివలచినిద్దురబాయ్యె వానికాళ్ళకుమ్రొక్కి- ఫలమేమన్నట్లాయగదవె నేదో-పిలియొగ్గిపలు మారుబిలచినా చెలువుడేపలుకడే ॥లల॥ తలిదండ్రులెంత నిర్దయులె-వారెకలవారమేమే పే-దలమాయవ్వరికైన- కలిమిలేములు శాశ్యతమ టెచూచి-పలుకనివారిండ్లకు - బోవలెనా కావలెనావో॥లల॥పిలువనిపే రంటమటె - చేసిపొలతి నెవ్వనివక్కపోదాయిదేమి- నీబలవంతపుమాఖ స్నానమటె-యిదిలో తలపున్న నవ్వపాటవెసిధట వేమి!లల॥కలసిమెలసి

నవారుగాదె-వచ్చి పెలుచనియిందుకూరిపేటమహేశుని-బిలువరెనాటి మర్యాదే-వచ్చి తులువకబుధులపొందుకలనానాకలనైనా॥ లలనా॥

వ॥ అని ప్రాణనాధునిడాయంబోయి యిట్లనియె.

కైవారం లయగ్రాహి॥ శంకరహాలహాల భయంకరపినాకభర। కింకరదిగీశతాకలంకతరమూర్తి। పంకజభవాభిసుతపంకజభవాండభవ సంకలితదైత్యులకు సంకటసుధాప। ద్యుకిసుతనాగకరకంకణవిరాజిత కళంకగళవాంభవిశుభాకలహారీస, త్పంకితమితాంత పులకాంకితయురస్థల మృగాంశతకోటినిభపంకజదళాననా॥

వ॥ అని మరియును.

మత్తకోకిల॥ నాగవాహనరంజనానుద నాగవిబ్వ్యమభంజనా। నాగదానవ ఖండనామునినాధ సాగరమండనా। యోగిరాజసమాజచిత్తపయోజమదవేషణా। నాగరాజవిభూషణా శరణాగతామరపోషణా॥

సుగంధివృత్తము॥ వారిజాసనాదిదేవ వందితాయవార్ధిగం। ధీరధీరఖండు కూరిపేటపాసనాయయం। చూరిసుబ్బరాయహృత్పయోరుహాసవామనః। పూరి తైకబంధరా పుణ్యమూర్తియేనమో॥

వ॥ అని కొనియాడిన విని సవరణగా దేవదేవుండిట్లనియె.

కందార్థం॥ సహజము గానసుజేరక। మహనీయములైననూత్నమర్యాదలతో। బహువిసలింపుచునిటులక। తహతహపడుటేమిసౌఖ్యదాయకిరావే ప్రాణనాయకి- తోయజముఖినాతో జెప్పుమునీ-కీయనుమానంబెందుకు॥

## దాక్షాయణి దక్షయజ్ఞమునకుపోవ నిశ్చగించుట.

వ॥ అనిన దాక్షాయణి యిట్లనియె.

ఉ॥ రాజితరాజరాజదినరాజ భుజంగమరాజభారతీ।
రాజనిలింపరాన మునిరాజపయోనిధిరాజరాజనో।
రాజవిహంగరాజ యమరాజసరోజనివాసగేహనీ।
రాజనురాధిరాజగిరి రాజసుతావినవయ్య శంకరా॥

వ॥ ప్రాణనాయకా ఒక్క పిడుగువంటివార్తవింటిని విపరీతం బేమో తెలియదు.

కందార్థం॥ మనలవెలిబెట్టిదక్షుం। డటవందగజేయుపూని నటయాగంబీ। జనులాయజ్ఞముజూడక। జనువారలుజూడవయ్య శంకరా నానాథవభయ॥ శంకర॥ ఇంకానందియమేమటమనము-పొంకముమీరగపోవలెనయ్యా॥ శంకర॥

వ॥ అనిన దేవదేవుండిట్లనియె. మీతండ్రియైనదక్షుండదక్షదీక్షుండై నన్నుదీకరించి కార్పిచ్చుపయింగమకించు ఖద్యోతలనుంబోలెయజ్ఞం

బుజేయబూనుట యేను నెఱుంగుదు నాయాగంబు సాగంబుగా నీడేరదు గావున నిదియాశ్చర్యకరంబుగా దాయజ్ఞంబు జూడబోవుజనంబులవమానంబునొంది వచ్చుటాశ్చర్యముగాని మనంబేగుట కర్తవ్యంబుగా దనిన సతియిట్లనియె.

ఉ॥ నాధనచీమనఃకమలనాధుడు కిన్నరనాధుడుర్వరమా।
నాధుడుభారతిహృదయనాధుడు పంకజనాధుడుజ్జగ।
న్నాధుడురాత్మసోమనను నానందమునొందుచుబోయినారుభూ
నాధులుమానులందరుజనంబులు బోదురదెట్టియాగమో॥

అన్యదేశ్యము-దర్వు-హిందుస్థానికాపి-అటతాళం.

కౌమారీవినవే కౌమారీవినవే॥ తామసమేటికేదక్షుండు నేటికిమా। మై తేయరుదా।మర్యాదవలదా॥ కౌమా॥ కైలాసనిలయ కైలాసనిలయ। మూలము దెలియని మూఢునిదక్షుని-పాలించతగదా పగబూనేబిరుదాకై॥కౌ॥ కూరిమిమాలిన కుజనులయిండ్లకు చేరబోవదగునా-చెలిమిగావలెనా॥కౌ॥ మదిగరియనిమీమామల్లుండ్లకు-యిది యేమికలత-యెందైననుగలదా॥ కౌ॥ నేటికియిందుకూరి పేటలోపల జేరి-నాటించవలెగా -రవాటిరిబాదగునా॥ కౌమారీ॥

వ॥ అనిన దాక్షాయణియిట్లనియె. దేవా మహాశ్చర్యకరంబయి గుణత్రయాత్మకంబగు ప్రపంచంబుభవదీయమాయా వినిర్మితంబగుటం జేసి నివానావిహారణంబులగు ఇటువంటిప్రయత్నంబులు మాబోటిపామరులకువింతవింతగవినోదంబులై యుండుఁగాని నీకాశ్చర్యకరంబుగాదయినను భవదీయదివ్య తత్వసత్వంబెరుంగంజాలక కామినీస్వభావంబుగల కృపణురాలనయి మదీయజన్మవంశంబుగనుంగొన నిశ్చయించితిగావున నక్కడనాదేహసంబంధులయిన తలితండ్రులునన్నదమ్ములు నప్పజెల్లెండ్రును తత్తత్పుత్రికా జనంబులును నానావేడుకల నుందురు గావున వారలంజూచుటకు నాయందుప్రసన్నుడవయిమదీయమనోరథంబుదీర్పనర్హుండవు గనాపమధిక జ్ఞానంబుగల నీచేత భవదీయదేహంబునందర్ధంబుధరియింపబడితి నిట్టినన్ను ననుగ్రహింపవలయుం గావున.

స్వదేశ్యము-దర్వు-ఆనందభైరవి-ఆదితాళం.

శెలవియ్యవయ్యా-ప్రాణనాయక- అవ్యాకులమానసైకభీష్టదాయకవినుము-తల్లితండ్రినయినజూడనీ-దానిజన్మమేటికి॥ శెల॥ అనినశివుం

డు-నామాటవినవే ప్రాణనాయకి-నీపై కామింపరాదెసకలాదాయకి- నీకీ-వ్యామోహమేమిదక్షాధ్వరముసంతాపకరముగా॥

వ॥ ఇదియునుంగాక మాతండ్రి దచ్చటికినచ్చునపుడు నేనతనికి ప్రత్యుత్థానాభివందనంబులు గావింపకుండుటం జేసి యతండు దిరస్కృతుం డయ్యెనంటివే నీలోకంబుల నన్యోన్యంబు ప్రత్యుత్థానాభివందనంబులు గావింతురదియుం బ్రాజ్ఞులయినవారు సర్వభూతాంతర్యామియయినపరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావున గాయకవ్యాపారం బయుక్తంబనితదుద్దేశంబుగా మనంబునందు నమస్కారాదికృత్యంబులు గావింతురు గానిదేహాభిమానంబుగల పురుషులయందు గావింపరుగావున నేనును వాసుదేవశబ్దవాచ్యుండును శుద్ధసత్వమయుండును నంతఃకరణమునం దావరణరహితుండై ప్రకాశించు వాసుదేవునకు నాహృదయంబున నమస్కరింపుచుండుదు నిట్టినిరపరాధినైననన్ను బూర్వంబున బ్రహ్మాలు జేయు సత్రయాగంబునందురుకులంజేసి పరాభవించిన మద్వేషియయినదక్షుండు భవద్ద్వేషుండు తదనువర్తులైనవారును జూడందగుగావున మద్వచనాతిక్రమణంబు జేసి నీవచ్చటికరిగితివేని బంధుజనంబుల వలన బూజవడయక తిరస్కారంబునొందుటకానిగదాయనినపార్వతి యిట్లనియె,

దరువు॥ హానిగల్గెలాగై తేయందరు- యెందుకుబూనియీలాగున బోవుచుందురు- అయితేకాని చెడురాని మంచిగాని యేమైనగాని॥ శి॥

శివుడు॥ ఊరూరివారుబోతే పోదురు- యిందుకూరిపేటనెవ్వరు బోదురు- పోరానిచోటకుపోతే రారానినిందలువచ్చును॥ నామా॥

వ॥ ప్రాణనాయకా పుట్టినింటికిం బోదలంచితింగాని బోరాని చోట్లకుం బోవుదాననుగాను మాతండ్రియైన దక్షుండు తెలియనిమాటలాడినను నీకు శ్వశురుండుగాని శత్రుండుగాడు గావున.

సీసార్ధము॥ అఖిలాండకోటి బ్రహ్మాండభాండంబులెం జేనిలోజొచ్చుదానికంటె। మనుమునినిర్మితపురత్రయదైత్యసంతతు లానాడు నీమహాసదానికంటె। వికటదుస్సహమహావిషముగ్రహించి బూనినిన్నదలించుదానికంటె। నంధకాసురదుర్బ్రహ్మలంధరాదులు బూజనిన్నెదురించుదానికంటె। యీమాటకేకోపమా- దక్షునిగికురించుట- సామినేశేయుపాపమా- మోమాటమేమిటువెనుక-నామాటలైనవినక- మామల్లుండ్లమ్మగనుక-యేమోహోనిమ్మనక యీమాటకేకోపమా॥

హుసేనిరాగము-అటతాళము.

యేమిసేయుదునతడు నన్ని పుడెంతచిన్న తనంబు జేసెనె భామిని-
మందాగామిని॥ యే॥ వంచనామదిబూనియవమానించరాదని దెలియ జే
యదలంచెనే-పగసాధించెనే॥ యే॥ యాగమాత్వరలోనరతపవియోగమై-
పోగానియదికొనసాగున-చెడునీలాగున॥ యే॥ ఇప్పుడేనీవైనమీపుట్టింటికే
గుదువేనిగండముతప్పదునామనసొప్పదు॥ యే॥ కలికి తెలియనిదాన వేమో
గావునకలకాలంబుమాటలునిలుచునె-వూటలుగడుచునె॥ యే॥ నోటిమా
టలుకండ్లచూపులు నేటితో పరిపోవునింకా-యేటికిపొమ్మచోటికి॥ యే॥ బేల
వై మనఇందుకూరిపేటవిడువంజూతు వాగడమేల నేసరసము చాలునే॥ యే॥

వ॥ అనిన సమరసభావంబున భవాని యిట్లనియె.

ద్విపద॥ పరమేశనీవిట్లు బలుక నేమిటికి - దొరకొనిదక్షుని దుర్యాగమునకు-
బోయిననేమింకబోకున్న నేమి - నీయాజ్ఞ బొందక నేనెట్లుబోదు - వివిధంబులయిన
దుర్విషయవులమాని - భువనమోహననిన్ను బొడగానలేని - యరువుమాలికనన్ను
లేమిజేయుటకు - పురుషసింహమునిన్ను భోగింపలేని - తనులతావలనిసౌందర్యమేమి
టికి - మనసారనీమంచి మాటలువినని - చెవులేలనీపాదసేవకవృత్తి - దవిలినీయధరా
మృతంబానలేని - నాలుకెందుకు కాల్పనాథవదివ్య - మాలికాగంధమబ్బని ముక్కు-
లేల - నయనంబునీకు దాస్యముసేయలేని - జననమెందుకువేయు జన్మంబులకును-
గావునముందరగతిగానలేక - సేవగించెనుదక్షు డేమగునొక్కొ - విధినిషేధంబులు
వివరించనేల - వధిపమారొదలతప్పులన్ని క్షమించి - నెట్టనసెలవిచ్చి నీవుబంపినను-
పుట్టిల్లుగావున బోయివచ్చెదను॥

వ॥ అనిన విని యానందకందళితహృదయారవిందుండై దేవ
దేవుం డిట్లనియె.

ఉ॥ మెచ్చనిమామలిండ్లకును పైకొనిశోభనవేళబిల్వమిక ।
బొచ్చుముగల్గుపోదగుటబోలదుయలరకిజ్జగంబులక ।
బొచ్చుములేదుకన్యలకుపుట్టినయిండ్లబోయినలోకముల్ ।
మెచ్చునపోవుముఖబ్బమున మీతలితండ్రులజాడపైదలీ॥

ఉ॥ మాటలువేయునేటికివి మాకడనీవును నేమునీకడక !
పాటలగంధియుండుదుము బాలకిలబ్ధము అర్థ మెట్లునా ।
మాటకుదాటగాదలదు మన్ననినీచెలులెల్ల గొల్వగా ।
బోటిరొపొమ్మునీజనకు పొందగునోమునకుక గుటుంబినీ॥

వ॥ అని దరహసితవదనారవిందుండై ప్రమథగణంబులం జూచి
వోరీ గజకర్ణ లంబకర్ణ లంబోధర సూర్యవర్ణ శతమాయమహామాయ
మహామృత్యుహరాదులయిన ప్రమథగణంబులారా వింటిరా మీతల్లి

పుట్టినింటికింబోవ నిచ్చగించియున్నది గావున మీరలొక్కదివ్యరథంబు పై నెక్కించుకొనిపోయి రావలయుననిన వారలొక్కదివ్యరథంబా యత్తపరచి దెచ్చిన సతీదేవిజూచి చెలికత్తియలతోనిట్లనియె.



సతీదేవి దక్షాధ్వరంబున కేగుట.

మధ్యమావతి - ఆదితాళము.

పోదాముపదరే-భామినులారా॥పో॥మోదమునమాతలిదండ్రులు సోదరులుసోదరీజనంబులు- సాదరంబుననన్ను బహుమర్యాదసేయకపో దురటవె॥పో॥ ఖలుడుదక్షుండఖలజనులకెబిలచి మనలకెబిలువడటుపోవ కిదువలదనిప్రాణనాథుడుసెలవొసంగకసెలవొసంగెను ॥పో॥ అమ్మచెల్ల యిదేమిముందర తుమ్ములెర్రనిదుమ్ములీకాకమ్ములాఘూకమ్ములీశకునముల పశకునములాయెను॥పో॥ బోటిరో శ్రీయిందుకూరివేటపరమేశ్వరుడుజె ప్పినమాటనిక్కముగానీయెడసీలాటిశకునములౌనటే॥పో॥

వ॥ అని యిట్లు శివునిచేత సెలవుదీసుకొని డోలాయమానమానసియై కాలగతిందలంచిబయలుపడనీక దక్షాధ్వరసమీక్షణోద్యోగియై పోవుచున్న సమయంబున సఖీజనంబులు తమలో దామిట్లనిరి.

సీ॥ వీణయుంనీవుదే వీణానుభాషిణీ ముకురంబునీవుదే ముకురవదన ।
రాజహంసనుదెమ్ము రాజహంసికయాన కీరంబునీవుదేకీరవాణి ।
మణిహారములుదెమ్ము మణిగణాలంకృత పువ్వులునీవుదేపువ్వుబోణి ।
గంధంబునీవుదేకమనీయగంధి కనకంబునీవుదేకనకవల్లి ।
పాలతియాడుపసిడిబొమ్మనునీవుదే । పసిడిబొమ్మయొసగమెసగుకొమ్మ ।
పలయునట్టిపెక్కువస్తువుల్గొనిరమ్ము । గౌరివెంటమనముగదులవలయు ॥

వ॥ అని సఖీమణులుం బ్రమథగణంబులు సతీదేవియుం గగన మార్గంబున బోయిపోయి దక్షాధ్వర వాకిటం దగ్గరి తేరుడిగ్గి సభాసదుల నవలోకించినం దమతో నెవ్వరుం బలుకకున్న కొంతదడవు చింతించి కాత్యాయణి తనపక్షజనంబులతో నిట్లనియె.

ద్విపద॥ ఓచంద్రముఖులార యోసఖులార । చూచిచూడని నేడు జూచితిమహాహ । యదెవో ప్రసూతిమాయమ్మనట జూచి । యిదియేమి మూతిచెయ్యట్లనెనమ్మ । సుదతియాతం డేదక్షుడు ననుజూచి। యదలించి క్రోధతామ్రాక్షుడై పోయె। పరికించిచూడుడీపది యేనుమంది।యరవింద ముఖులుమాయప్పజెల్లెండ్రు । ననుజూచిగికురించినవ్వులునవ్వి।కొనుచు సీయంచు గ్రక్కునబోయిరం। రబలయిందరున్నారుండి యేమికారణము। మందగామిని చంద్రమౌళి లేకున్న । సరిగానినోము వాసము లేనిగీము। వరి లేనియూరు కావ్యము రానినోరు ।పగిలినయోడ దీపము లేని మేడ।నగరాని నవ్వుగంధము లేనిపువ్వు। పతి లేని భామ భూపతి లేనిసీమ। యతి లేనిమఠము యోగ్యత లేనిహఠము।పాలియనిగడ్డిఆవులు లేనిదొడ్డి ।ఫలమీయని చేను జీవము లేని మేను।నిపుణని మైత్రి వెన్నల లేనిరాత్రి।దివుట దేవుడు లేని దేవాలయంబు। మెలగనివిల్లుకోమలి లేని।శిల లేనిపూజమచ్చిక లేనివాజ। లేమరో యిదిచిలుల లేనిపంజరము । గామదిదోచుటగానియజ్ఞమట నే॥

వ॥ ఇట్లనుచున్న సమయంబున దక్షుండు యాగంబొనరించుచుండె నంత నెవ్వరుం బలుకకున్న సతీదేవి సఖీమణులతో యిట్లనియె.

కాంభోజిరాగం - ఆదితాళము.

ఔ నా నేమావారెనాపై అలగిరే-కాని లేకొందరుఘుందరిగతిగా నరె॥ఔ॥ తల్లితండ్రులైనచూడనొల్లరె-చల్ల బోమనపగ వారుల్లాసిల్లిరె॥ ఔ॥ సరసుడపుడు జెప్పినంతిజరిగెనె-విరిబోణినామదిచిటుక్కునివిరిగెనే॥ ఔ॥ మాతల్లికినే నెంతో భారమయితినే-ఘాతామనివచ్చికొరమాలిపోతినే శివునితో నే నేషనిమనవి జేతునే-యువిద యీయును రెవరికి దారపోతునే॥ ఔ॥ సోదరీజనులైననాకనులజూడరె- సాదరమునాసభికులేమాటలాడరే- ఇంపుముఖినామాటలెవరువింతురే- ఇందుకూరిపేటసుజనులేమందురే॥ఔ॥ వ॥ అని మరియు నిట్లనియె.

ద్విప॥ యెలనాగలార నేడింపరింపుండి। పలుకరిదేమిపాపంబు జేసితిని। బావలు మరదులుబంధువర్గంబు । మావారు సైతముమాట్లాడరైరి।

బహుళవిరోధమేర్పడెనిదిగాక। మహనీయమగు సభామధ్యంబునందు। అవమానమయ్యె నేమందు నావిధిని। శివుడు జెప్పినమాట జెవిదూరకపుడువచ్చినందుకుహానివచ్చె నేమందు। నచ్చటికిచ్చటికతిచులుకనైతి। నోకృతక్రతులార యో పెద్దలార। యోక్రతుభుజులార యోమునులార। యో దేవఋషులార యోమునులార। నా దెసజూడకున్నారి దేమయ్య। పరగదక్షునికి నే పట్టినై పుట్టి। పరమేశ్వరుని గట్టబట్టినేడిట్టి సరినారిలో యెగసక్కెమయిపోతి। తిరిగిచూడరి దేమిది క్ష్మాపాలులార। భయమేమిదక్షునిపాలికిబోయి। నయమునసడిగెద నాతప్పు లేమో॥

వ॥ అని చెప్పి హోమంబుచేయుచున్న దక్షునిపాలికింబోయి సతీదేవి యిటులనియె.

## దాక్షాయణీదక్షసంవాదము.

శా॥ తండ్రీ నీనగుమోము జూడదగనా తర్కింపనా చిన్నచె। ల్లెండ్రం బిలిచియు నన్ను జీరవు మదీయాధీశు నీయున్నయ। ల్లుండ్రం బిల్చియు బిల్వరావు యిలవేల్పల్ కర్తలే పూజకుజ। యింద్రం జేసిన నేమిగల్గు జెపుమా విశ్వేశ్వరుండుండగన్॥

వ॥ అని మరియును.

శా॥ దేవేంద్రాదిదిగీశసంఘములకున్ దీవప్రభుత్వమ్ములె। ద్దేవుండిచ్చె పరాత్పరుండజరుడ ద్దేవుండు శేషాహికే। రావుండిచ్చెయగణ్యదక్షత జగద్దేవేశుడెవ్వాడు యా। దేవుండిచ్చకు నేడు రావలెనని ధియుక్తి జింతింపుమా॥

వ॥ అనిన దక్షుండు

ఉ॥ లోకములోన లేడు సురలోకములోనను లేడు కుండలీ। లోకమున లేడు మునిలోకములోపల లేడు దేవతా। లోకములోన లేడ సురలోనను లేడు వెతికితిచు। పోవ కలబోవు నేయెరిగి పూజలసేయుగ నెంతవాడో కో॥

వ॥ అనినవిని యించుక కోపంబున దాక్షాయణి యిట్లనియె.

ఉ॥ వేదములం దెరింగిరవివేకము లెక్కడబోయె నేడు పు। ణ్యోదయబుద్ధి యందడిగియున్నది నేడు దలంప తుచ్ఛమై। నీదగు దక్షతత్వమును నీతియును నెందున దాగె నేడు బ్ర। హ్మాదులబోని బ్రజ్ఞమది నారడిబోయెనె నేడు యక్కటా॥

వ॥ అనినవిని యించుక కోపంబున దక్షుండిట్లనియె.

## సంవాదం-దర్బా-మారువరాగం-ఆదితాళం.

నీవైపిలువని పేరంటమునకు- రావచ్చునటే కౌమారి॥ యిటురావచ్చు॥ కేవలమిట్లపకీర్తి - భాజవముగా వచ్చునటే కౌమారి॥ సీ॥ గోవాడవుకొరగావపకీర్తి- నీవేమూలమురా దక్షా దక్షా- నీవున్నావని నేవచ్చితినిపోవచ్చుగదా దక్షా దక్షా॥ గో॥ యెవ్వరునిను మాయింటికి- రమ్మని రెవ్వరుబిలచి

రకౌమారి॥సీ॥ నప్పులకెకయ్యంబటెగాల్ - ద్రవ్వేవేమెకౌమారి॥సీ॥క యమునకుకాల్ ద్రవ్వెదెవ్వరో-దయ్యంబెరుగునుదక్షాదక్షా- వెయ్యే టికినియాగమునీవై-పొయ్యెదెరుగ వెదక్షాదక్షా॥అట్లావానిగుబాటాయి టా-మాట్లాడుదుర కెకౌమారీ॥ యిటు॥ మాట్లాడినభయమపోపొమ్మని- పోట్లాడుదుర కెకౌమారి॥సీ॥పొలుకులమూలినసీతో నేనె - పోట్లాడుదు నాదక్షాదక్షా॥పో॥గెలిచికట్టిపాడుకోటస- ప్పలమేమున్న దీదక్షాదక్షా॥ గో॥పాపకారినాపై కొరమాలిన - గోపంబెందు కెకౌమారి॥సీ॥పోపోపా మ్మంబెపో వేమివృథా శాపము లెందు కేకౌమారీ॥ సీ॥దోసకారినా శాపమె న్నటికివిసరబోదురాదక్షా॥విస॥ బ॥సీసీఛితడిసీముప్పందుము-మోసే వేమి రదక్షాదక్షాగోవా ॥ చిందరవందర జేతువునీకీతొందరబోద కెకౌమారి- ఇందుకూరిపేటంమురునినుతగుదువందురుజూడ వెకౌమారి॥ సీ॥

వ॥ అనిన భవాని గంభీరంబుగానిటులనియె.

ద్విపద॥ ఓరిదురాచారరోపాపకారి - తారతమ్యమెకింతదలపోయవకట- సింగంబునెదిరించుతింకచందమున - గంగపైబారిన గంజిగుంటట్లు - కదలిపైగమకించుకాలువరీతి - మిడుతకార్చిచ్చును మ్రింగజన్నట్లు - గరుడతోపాము గలసినరీతి- కరినదల్పెడు మశకంబువైఖరిని - కొండతోగరుడికొన్నట్లజంబు - పుండరీకంబుతో బోరాడుభంగి - సర్పంబుపైకిమూషికమేగినట్లు - నేర్పునశివునితో నీవెదురింతు - వలఘులఘుప్రకారాంతరాంతరము - దలపోయవేనాటిదక్షుండవీవు - కులనాపసుండవు కుఘులవిగాని - తెలిసినవాడవై తేయిట్లుజేయ - వలతువెహరునితో వైరంబుదగునే - జలమలెన్నియుబారజల్లియుంకింప - మెలగకనవియెల్లమరలకండింత - జాలుమహేశుని సన్నుతిచేయ - వెలయరాదక్షనీకీడురాపేక్ష॥

వ॥ అనిన దక్షుండు కోపోద్దీపితమానసుండై భవానింజూచి యిటులనియె. శివుండు నిర్వికారచిత్తసాధ్యుండని సర్వజనంబులురోయుదు రదియెరింగి సమతగాకునికి బిలువకుంటినిదెచూడుము.

తరళ॥ పరగమత్తపయాధినాథులు భాగ్యవంతులుశ్రీయుతుల్ । వరుసతల్లియు దండ్రియుంగలవారు నిత్యమహోవ్రతుల్ । ధరణిలోకులగోత్రవంతులు తక్షాలెందుదలంపగా । తరుణియిన్నియువలదునీపతి తారతమ్యముచెప్పవే॥

వ॥ అనిన సతీదేవి యిటులనియె.

గీ॥ శివునితారతమ్యముబట్టిశివుడుదక్ష । యెలమినీబోటిమూఢులకెట్లుదెలియ । నయ్యయోశివుడద్వయుండాదిదేవు । డతనికగ్గౌనరించినహానిదేడే॥

వ॥ అనిన దక్షుండిటులనియె.

దర్వు-ద్విజావంతిరాగం-ఆదితాళం.

ఏమిచేతు రేమి జేతు రే-నీ దేవుడునీ-వేమి జేతు॥ ఏ॥ మామలై నయ ల్లుం డ్రైనమం చిమంచి లేకున్న మోమాట ముంచవచ్చునా-నీ దేవుడు ॥ ఏ॥ మరచితల్లి పుట్టిల్లు మేనమామ కువద్దబొగడినట్లు-హరునిందుగీ ర్తింతు వెం దుకే॥నీ దేవు॥ఇచ్చకనే లసెదకి కాదకి తెచ్చినిన్ను జంగము వాని-కిచ్చినపుడె ఋణముదీ రెనే ॥ నీ దేవు ॥ నేటికయిన ఇందుకూరి పేటనుండే వీరేశ్వరుడే నాటి వేల్పెవ్వ డెరుగునే॥ నీ దేవు॥

వ॥ అనిన ఖండితభావంబున రుద్రాణి యిట్లనియె.

శా॥ ఓరీదక్ష యదక్షమానసవృథా యీదూషణం బేమిరా । యోరీపాపము లెల్లబోవిడువరా యుగ్రాత్మ చేపట్టరా । వైరంబొప్పదురాశివుదలపరా వర్ణింపరా రాజితోం। కారాత్మండగు నీకు కంతువిడువంగా నేలరాదుర్మతీ ॥

వ॥ అదియునుంగాక.

మత్తకోకిల॥ సాహసంబునమందరంబు విచారహీనత జెచ్చితా।
రూహ లేకపయోధిద్రచ్చుచునున్న శ్రీరమణాదులా।
దాహదోహదనీలవహ్నులతద్దయుం వడిజేయుంహా।
లాహలంబర చేతబట్టి గళంబునందు ధరింపడే।

వ॥ అనినవిని విరోధాభాసంబున దక్షుండిట్లనియె.

ద్విపద॥ అహహనీమంచియాయల్లునిమంచిబహుమేలుబహుమే లుబాగాయెనకట-సన్యాసిగాక సంసారియుగాక - మాన్యముల్ముండించి మంటపాల్జేసి-వావిరియేవాపివర్తనలు లేక-కో వెల లేరతికూడముల్ జేయ వేడుకాయనె వెస వెసబొమ్మలాట లాడబోనటయి దేకును వారు లేక-నిచ్చ కమాబిచ్చమెత్తుకోవలసి-వచ్చెగ దాయంత వారెంతకయిరి - పాములగా ములబట్టియూరూర- సాములమంచి వేసంబులబన్ని - యుదికేదమని కేది యుద్యోగమేది-కనుకొండవీటిజంగమువృత్తిబూని-భూతవైద్యుండాయె బోయొంటిగాబ- రేతభూములనుజరించుట దేమి- వానిమానిసియనవచ్చు నేపుడమి-గానని వార లెక్కడగూళికొనిరో-రాజకీయంబును రాగొరమా లి-పూలకుబ్బిడబ్బుమ రేమి లేక-కల్లరీడనగనిక్క ముదోచబడక - తల్లితం డ్రుగురుదైవము లేక-పడి మొలచిన చెట్టుప్రబలమైనట్లు- పుడమినెల్లడిలను పుంజీకరించి. కులగోత్రములుకొద్దిగొప్పలు లేమి - కులుకుచునూరూర నూరేగమరిగి-పురుషుండుగాక పూబోడియుగాక - బెరసిన తాల్మిగబ్బిప సందు జేసి-మెరిగిమెరుంగనియెల్లరగూర్చి - మురియుచుధనధాన్యమును

గొల్లబెట్టి నరిముఱినున్న గొండంత కాపురము-బరువడిగోచి బాపలపాలు జే
సె-నృపదంబమెందేని నెరనమ్మ రేని - గిరుఱించియొదలే మొగించుట దేమి-
తొలగినాతప్పమీతో జేయునే స్త-ములుమింటిమీది సాములుగదా మం
చి-గలనాటిచుట్టాలుగలిమి లేకున్న-కలనయినగారవంగావిన లేరే॥

వ॥ అని విరోధాభాసంబునబల్కి-నవిని దోధూయమానహృద
యయై భవానియిట్లనియె, శివద్రోహులెవ్వరు క్షేమంబునొందిరో చూ
డరాదటాయని మరియును.

గీ॥ హరునిగై గొనరింతువట్లగుటవలన। నీవుచేసెడుయాగంబు నిష్ఫలంబు।
యిట్టినీకు నేబుట్టితినిందువలన। నీకితనువిడివిడుచుట నిజముదక్ష॥

క॥ ఈయొడలుఱోతగాదె। పాయకపరమేశునొద్ద పనిసేయంగా।
వేయుమాటలింకేటికి। పోయెద రాయొండుతనువు బొందదు రాత్మా॥

వ॥ అని మరియునిట్లనియె.

సావేరి-అటతాళం.

ఓరోరి కాపకారీ-ఔరౌరా॥ వో॥ తారతమ్యముకింత దలపోయ
వకట-నీపౌరుషంబు-నేలపాలై బోను॥ వో॥ ఆడపడుచునుగోడుగోడనపిం
చునీపాడుయాగముభస్మీపటలమైపోను॥ వో॥ సారెసారెకు కేకి కేరిదూరె
దనయ్యయో-ధారుణేనీప్రజ దగ్ధమైపోను॥ వోరోరి॥

వ॥ అని సఖీగణులతో దైన్యభావంబున నిట్లనియె.

సీ॥ తండ్రినాబిడ్డనుతలపోయడాయెగా-దాయగాపోయిదండంబులిడిన।
తల్లిసైతముదయదల్పదాయెగా-దాయగాదలచెనాతాత్వమందు।
నాడుసైదోడులకాత్మనింపాయెగా-పాయగానయిననాపలుకువిన్న।
చెలిమిసఖ్యులకుకన్నులచల్లగానాయె-గానాయగాథంబుచందంబుగన్న।
నట్టిపరమేశ్వరుని చెట్టబట్టియిట్టి। పుట్టినిల్లనిమెట్టక మెట్టదొట్టి।
రట్టడింగట్టితిపుడనెట్టిమాట। గుట్టుబోకపోనిజెట్టునైతి॥

వ॥ అనిన సఖీగణుబు సతీదేవితో నిట్లనిరి.

నాదనామక్రియ రాగం-ఆదితాళం.

నాడువ్రాసినబ్రహ్మ- నేనువ్రాయునకొమ్మా - పాడుయాగ
ముపైనీకీభ్రమతలింకెందుకమ్మా॥ నాడు॥

క॥ నుదుటవ్రాసినవ్రాతకు। నుదతీ చింతింపనేలచూడుము శ్రేయో।
భ్యుదయస్థితులతుతమతము। పజసఖులకుబిలతురన్యజనులొండొరులకా॥

దరు॥ తల్లితండ్రులై తేమున్ను-బిలువకుందురటెనిన్ను - కలిమి
లేములు శాశ్వతమా-కాలమహిమా దెలియగలమా॥ నాడు॥

గీ॥ నెలతపెనిమిటిమాటకుమీరరాదు । తెలిసిపుట్టింటివారి-లిట్ట రాదు ।
నీవుజన్మించినట్టివేళవిశేష । మేమి జెప్పఁజాలకాలమిట్టివేళలు ॥

దరు॥ అంతకింతారాదుగద వే - యింత కెంతవునోగద వే - చింత లాగ్రవంతలాజినికి- చిడిముడిపడ నేమిటికి॥ నాడు॥

గీ॥ మాటలొక్కటీరుమర్యాదలొకతీరు । గుణముతీరుపేరుగొప్పవాని ।
యొరులతప్పులెన్ను దురుతమతప్పుల । జోలిబోరిదేమి కాలమహిమ ॥

దరు॥ ఇందుకూరిపేటశివుని - యిందుబూజింతువేని - సుందర దననీమదిని కోర్కెలీడేరుగాని॥ నాడు॥

వ॥ అని యిట్లు సఖీమణులు జెప్పుచున్నంతసతీదేవి నిరామయుని ష్టంబూని యోగాగ్నివలనకారణకర్మశరీరంబు గాల్పనుద్దేశించి తెంపున నిట్లనియె.

దాక్షాయణి యోగాగ్నివలన దగ్ధంబగుట



అన్యదేశ్యము-హిందుస్థాని-రూపకతాళం.

అయ్యయ్యో యెంతమోసమాయె నెటులసైతునే॥ అయ్యా॥ చయ్యన నాపాలిటివిధిచలముబలము జేసెనే॥ అయ్యా

గీ॥ వలదువలదని చెప్పినపలువిధములు । ప్రాణనాథునినమ్మించిబయలుదేరి ।
వచ్చినందుకుమోసంబువచ్చెనిందు । కేమిసేయుదునిదిపరమేశ్వరాజ్ఞ ॥

దరు॥ మరిమరియాచెనటిదక్షుండు మాటలుబోనాడెనే - హరి హరిశివుడన్నమాటలన్ని నిజమాయెనే॥ అ॥

గీ॥ ఇచటనాదేహమెట్లయిననచటనాథు । డెంతచింతిలుచునో అంతకింతయయ్యో ।
ఇంతకెంతౌనొచూడవేదంతిగమన । శివునితోవున్నదున్నట్టు జెప్పవలయు॥

దరు॥ ఇచ్చిపుచ్చుకున్నచోట్లకెంతచులకనైతినే- ఇచ్చటనీక్షణమున నేనీ దేహమువిడతునే॥ అ॥

గీ॥ మీరున్నావల్లభునిమనన్నూరడిల్ల । నావలెయింకొన్నినాళ్లపాటు ।
తెనుకముందుదలంచినామనవిచిత్తగించి । ఆల్లసతియిల్లనిప్పించరమ్మ ॥

దరువు॥ నేరమేమిజేయకనే నిందలపాలైతినె - కూరిమియింౌదు కూరిపేట వీరేశునిగలతునే॥అ॥

వ॥ అని యిట్లు తాను కారణశరీరంబుదగ్ధంబుజేయందలంచినిర్వికల్పసమాధినిగుడించియీశ్వరాయత్తచిత్తంబున పరమభద్రాసనాసీనయై కుండలిచలనంబుజేసివాయువునున్యాసిసవ్యంబుల రేచకపూరంబులుజేయుచు షడాధారంబులనీక్షించి కేకలంధకమునశివస్మరణంబుజేయుచు దూమధ్యంబుమెల్లకొని మనోన్మంగల పరబ్రహ్మరంధ్రకవాటంబుమెల్లనదీయదలంచినిర్వాతదీక్షంబుపగిదినిస్థరంగసముద్రంబునంబోలెయోగాగ్నివలన కారణశరీరకాననంబుగాల్చుచును నీశ్వరసన్నిధానంబుగల్పించుకొని యిట్లనియె.

ద్విపద॥ అరనురలేకని న్నాశ్రయించితిని - హరహర నాతప్పులన్నిక్షమించి - చరణసేవకునగుజక్షమీవలయునరిక్షురినీభార్యనౌదునేగాని-దురితాత్ముడుదక్షునికూతుగాను-యొక్కంటిలోభక్షుల్ లేకమనము-యొక్క-దేహంబు గానుందుమెగాని - కార్యగారణములేక్రమముననె-పార్యవందితమనమనపాయనుంము - ఇనుమయస్కాంతమందెట్లొప్పునట్లు - నినుజేరియున్నదినేరినామంబు-శివ యగురువేనమః- ఓంహర ఓంహర ఓంహర ఓంహర ఓంహర ఓంహర యేనమః.

వ॥ అని మరియును.

శా॥ రంగస్ఫారమనోరథభ్రమరికల్ రమ్యాననాంభోజముల్ ।
నింగిన్ ద్రావెలులేతనవ్వునురువుల్ నేమింపబెంపారుదో ।
ర్బందంబుల్దనరారళంకరుడనే పద్మాకరంబందునా ।
యంగంబింగజకేళిపూరమునన్నో రాడించుటింకెన్నడో ॥

వ॥ అనుచు గారణకర్మశరీరంబు భస్మంబుజేసి పరమేశ్వరానుగ్రహంబున సతిసుకుమారియగు బాలికయైపుట్టి బాలలీలావినోదంబున నాకాశవీధింజనుదెంచి హిమవంతంబుజేరి దినదినప్రవర్ధమానయైయొప్పుచుండె నంతదక్షుద్వారంబునకువచ్చియున్న బ్రహ్మమొదలగుదేవతలీఘోరకృత్యంబునకు యోచించి తమతమనివాసంబులకరిగి రప్పుడాసతిదేవి వెంటంబోయినకాంతలు ప్రమథగణంబులిట్లని వితర్కించిరి.

ద్విపద॥ అమ్మక చెల్లెయేమన్యాయమిట్లు- గ్రమ్మికవచ్చెనెక్క-

డబోదుమింక-నన్యాయమైదైవమాయలంగోనుగాను - యెయ్యదిజేయుదా
మెందుబోయెదము-ఓపుణ్యవరులార యోసురులార-మాపాటుదరిజూపి
మన్నింపరయ్యా-తనయునిక్కడబాసి- నవసెరింగినటించు సమ్మెడబాసి-
దీక్షవహించిసాధించిన చెనటి-దక్షునిగాల్ప్ర తాగాలిపోయె - సతితోడవ
చ్చియాసతినిందుబుచ్చి-బ్రతికితిమెంతటిబాపకారులమో - పస చెడియె
న్నాళ్ళుపాకులాడెదము- వసుధపై జీవచ్ఛవంబులంబోలి-రమణిమమ్మేవా
రురక్షింతురింక-మముకూర్మినెవ్వాడమన్నించువారు - చెలువచేజేతిని
క్షేపంబుబోవు-పొలుకువ తెలియక పోతిమిదేమొ - తడయక సూర్యుండు
తమ్ముల బాశి- పడనుటికడలిలోపల గ్రుంకినట్లు-కలువకూర్మిచీకాకుగావిం
చి-మెలతచంద్రుడస్తమించినరీతి-కేవలార్భకులనీక్షింపకతల్లి - బోవుచం
దంబులపూబోణిజనియె-బోటినిర్వాణమప్పుడు జెప్పినట్టి - మాటలుమర
చినమరపురాదమ్మ-దివ్యటనజన్మమెత్తిననాటనుంచి - సంరక్షణముజేసి
సాగెగదమ్మ- చెలితోడగూడవచ్చిననాటిసుఖము-తలబోయ కలనుపాల్
ద్రావినట్లయ్యె- కలిమిలేమిసుఖంబు కష్టంబుభూమి - కలవారుపొందక
గానిపోరిపుడు-నడచికైలాసమెన్నటికి జేరుదుము- నెడపక శివునితోనేమి
జెప్పుదుము.

వ॥ అని త్రిపురాంతక కాంతావియోగ చింతాక్రాంతస్వాంతులై కాంతలు కైలాసంబు జేరివటవృక్షంబుదగ్గరనిల్వ సమాధినున్న సర్వేశ్వరుంగనుంగొని యిచ్చటజరిగినవృత్తాంతం బచ్చటజెప్పందలంచిపోవుచు తమలోదామిట్లనిరి.

దరువు-ముఖారిరాగం-ఝంపతాళం.

మందయానమందయాన - నెందుగానమెందుగాన - మిందుండి నేడిందరిలోన నిందలపాలైతిమయ్యయ్యో॥మందయాన॥ మోసపోతిసు మ్మిక చెల్లనుంటుగా జేరినందువల్ల దోసకారిదక్షుడెంతటి - ద్రోహముజే సెనయ్యయ్యో॥మందయాన॥ బాపురేమమ్మిట్లామిన్నట్లు- బాపెనాబ్రహ్మ నేడియ్యెడపాతకారియైనాదక్షుని బారిగొరిచులమైతిమయ్యయ్యో॥మం॥ నాటికాలాగునరావడము- నేటికీలాగునబోవడము - బోటులారాయిందు కూరి- పేటకేమనిబొయ్యెమయ్యయ్యో॥మందయాన॥

వ॥ అని యిట్లు దుఃఖించుచు సఖీమణులు ప్రమథగణంబులంగూడుకొని కైలాసంబునకేగుచుండిరంత దక్షుండు యాగంబొనరింపుచుండె.

నయ్యెడ నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు దధీచి దక్షాధ్వరంబునకునో చ్చుచు తనశిష్యులతో నిట్లనియె.

—— దధీచిమహాముని దక్షాధ్వరంబునకేగుట. ——

ద్విపద॥ యీయురేయిటువంటిసుఖమేమిసుఖము- జేయించువారి నీక్షింపనేరాదు- జేసినవాండ్రను జెప్ప నేమిటికి - యీసున జేసెబోయిది శ్రద్ధగాదు- మజా రెమూర్తుని మత మేమి మరేము - వజ్యాలెల్లేర్పడవచ్చిరిచ్చటికి - భూమిపైనున్న దెప్పుడును లేదరయ - సామాన్యమా కానసాగదీసుఖము॥

వ॥ అని మరియు నిట్లనియె.

హిందూస్థాని-ఆది తాళము.

రా రా చూడబోదాము రావేరా-బిన్న రారా-వూరివారంతా బోతున్నారె లేరా॥ రా॥ ఘోరవు రామజారె యజ్ఞము చ్చానహి రా-బి॥ రా॥ అరే భేటా నహి యిందుకూరి పేటదేరా-బి॥ రా రా॥

వ॥ అనుచు వచ్చి సభాసదులతో మాటలాడుచున్న దధీచిం గాంచి దక్షుండెదురేగి సత్కరించి యో మునీంద్రా దయాసాంద్ర కీర్తిచంద్ర భవదీయాగమన కారణంబున నా యాగంబు ఫలించె నాయనుచు రమ్మురమ్మని యుచితాసనంబున గూర్చుండుమని సన్మానించిన దక్షునింగాంచి యిట్లనియె.

శా॥ ఓయీ దక్ష యిదేమి యిత్తెరగు దానూపింప లోకంబులో । నేయాచారము యెట్టిధర్మచరితంబో వేదమార్గంబహో । నేయాచారము యెట్టి ధర్మచరితంబే వేదమిట్టయ్యెనీ । ధీయుక్తిన్ బరమేశు బిల్వదగదే తెల్లంబుగా జూడుమా॥

వ॥ అని మరియును,

ఉ॥ ఏమనవచ్చు నిన్ను బరమేశుని బిల్వవిదేమి దక్షరాజ । సామయధర్వణాదిశ్రుతి సంఘములన్ బఠియించినాడవీ । భూమి దలంపదగిన ప్రోడవు నేడు శివుండు రాకున్న । నీమది జూడు మా ఫలము నిష్ఫలమందునో నిన్ను బొందునో॥

వ॥ అనిన నించుక కోపంబు దీపింప దక్షుండిట్లనియె.

మ॥ అదె మా యాగమునందు దేవతలు మున్నంభోజగర్భాదులున్ । త్రిదశేంద్రుండును నున్న వారు గడు సంప్రీతిన్ మహానంగళ । ప్రదవిధిన్ దగ మంత్రపూరిత హవిర్భాగంబు లేనిచ్చెద । ద్విదితంబై విధిపూర్వమై కసర గావింతున్ గొ సుఖంబున్న దిన్ ॥

వ॥ అనిన దధీచి యిట్లనియె.

కందార్థం॥ ఈవిష్ణువులీ బ్రహ్మలు । యీ విబుధులు నీగిరీంద్రులీ రుద్రులు యే । శివేశువలన బుట్టిరి । భావింపగ నేరవీవు పాపవిచారీ ॥ దేవుని దారి బడెదవీసారి- పోపో నీయాగమిప్పుడు బూర్తిగాబోదు । కోపించి శివుడు నీ యూపు మాపక పోడు - పాప॥

శ్రుతిజేసి - సలలితానో న్యైకసమ్మేళనమున - నాటసావేరిధన్యాసిరేగుప్తి - నాటకురంజి పున్నాగవరాళి-భైరవి ఆనందభైరవితోడి - భూరికల్యాణికాంభోజిలోకాక్షి - దేశాక్షి మొదలయినదివ్యరాగములు - భాసిల్లబాడుచుపైకస్వరములు - పైరాగములుగాగబరి నటనములు - నేలువుల్ చెన్నొందనృత్యముల్ గాగ - వరుసకీర్తులావర్తముల్ గాగ - సరసపదార్థకాళలతవాటిల్ల - పరమేశ్వరునిమీది పాటబాడుదము॥

వ॥ అని మరియు నిటులనియె,

అఖండకందార్థము॥ కేకీపైకబలాకా । కోకభరద్వాజనాగ కోయష్టికబా । ర్వాకపారావతాదుల-డాక్కడీకొన్న రీతి- డాసెనెయాచిత్రంబజూడే గానె నే-గిరిమోహినిగంధముబూసె నె-చీకటులంతంతన్నచూసె నే-నిండుపండువెన్నెలగాసె నే - జక్కవకవలుబాసె నే-వింతవింతపువ్వులుబూసె నే - తుమ్మెదలుదొరలుజేసె నే - కలకలమని చిలుకలుగూసె నే-మలయమారుతమువిచ్చేసె నే - పుప్పొడిముప్పలుగాబోసె నే-విరహులగనిమరుడొకదీసె నే - అదిగోసుమబాణమువేసె నే - యీశ్వరుం గాగంబిందుకూరివేషే శ్వరుడెరుగని దేమోమరుడాసెనె ॥

వ॥ అని కైలాసంబు డాయంబోవుచున్నంత హిమవంతుం డిట్లనియె॥

సీ॥ ధాతువిచిత్రతోదారరత్నప్రభాసంగతోజ్వలతుంగశృంగమ్ములను । కిన్నరగంధర్వకింపురుషాప్సరోజననికరాకీర్ణసానువులను । మానితనిఖిలవైమానికమిథునవిహారశైకశుభప్రదేశములను । కమనీయనవమల్లికానుమనోవల్లి కామతల్లిలసత్కంధరములు । నమరసిద్ధాంగనాశోభి తాశ్రమములు । విబుధజలయోగ్య సంపన్నివేశనములు । గలిగిబహువిధపుణ్యభోగములనొప్పు । వినుతిసుకృతములకుదండకొండికొండ ॥

వ॥ చూడుము సభామధ్యంబున శరశ్చంద్రచంద్రికా ధావళ్యాయమానదేహుండై ప్రకాశించు నతండెపో పరమేశ్వరుండు నిస్తరంగసముద్రంబునుంబోలె నిర్వాతదీపంబుపగిది మధ్యందిన మార్తాండసన్నిభుండై యేతత్కాలంబున నిర్వికల్పసమాధినున్నవాడు కావున చూడుమనిన యిదేశదా మహాకైలాసంబితండేగదామహాదేవుండని చూచుచు తనపునరాగమనంబు తేటపడం జరించుచున్న పార్వతినిదర్శనంబుపెట్టి పరమేశుని పర్వతేశుం డిటులనివినుతించె.

రగడ॥ జయజయ దైవత సాగరమంథన - జయజయదానవసామజభంజన-శరణుసనాతన శైలనికేతన-పురసూదనచలపూజ్యపురాతన-శరణుశరణురాక్షసనిర్మూలన- మొరవినుమాశ్రితమునిజనపాలన-పరమపురుషవృషభధ్వజశంకర-శరణాగతహృజ్జలజవశంకర-దేవానినువినుతింపర్ణజాలము-వాణివిభుముఖభావనిచేశాలము- దేవదేవుపవుదీసరనావన-

పావనమూర్తివిపంచీతజీవన – పాపరుడనుబహుపాపాత్ముండను – కామాంధుండనుగర్వయుతుండను– హిమవంతుండను నెంతటివాడను–యునిమిషవందితవినువంద్యులవేడను– యేమని చెప్పుదునిదినాకూతురు–భూమిజనంబులుపూజచేతురు– సదమలశాంకరిచంద్రకళాధరి యిదిపరమేశ్వరి యీతిజపాధరి– కామిని దెసనీకన్నులచూడుము – ప్రేమనుదీనిఁ బెండిలియాడుము– దేవరకంటెచుదిక్కేమున్నది– భావింపుమునీప్రాప్తమిచిన్నది– తరుణీమణియునునీదాస్యముగోరెను– సరసతగలతనుసంధిచేరును–నీవల్లు నేటికి వింటిని– దేవాళసములదెలయుంగంటిని– యిందుహూరిపేటేలునుపేడవనీశర్వ– వందనమయ్యశివాపరమేశ్వర॥

మ॥ అవఘారీశ్వరవిశ్వపంబుమదిలో నాలించిరక్షింపుమీ । యుఁవిదారత్నము నుంచిబోయెదను నీయొద్దఁ భక్తదాసియై । దివుటన్వర్తన జేయుచుండెడిని శ్రీతిఁక దీనిరక్షింపుమీ । యవిరోధంబునలీలబంచి పరిచర్యల్ చెప్పి చేయించుచున్॥

వ॥ అని గిరీంద్రుండు గిరిజామహాదేవిని గిరీశునకు కానుక పెట్టి వీడ్కొని నిజహాసంబున కేతెంచెనని చెప్పిన నవ్వలివృత్తాంతం బెట్టు లుండె నానతీయవలయునని యడుగుటయును.

ఆశ్వాసధవళ.

జయజయనందకుమారం – జయజయమందరధీర ।
జయజయకాంచనచేల – జయజయరాధాలోల ।
జయజయభువనోల్లాస – జయజయభూరివికాస ।
జయజయకరుణాపాంగ – జయజయగరుడతురంగ ॥

గద్య. ఇతి శ్రీ శౌనక సగోత్ర పవిత్ర మంగనామాత్యపుత్ర వేణుగోపాల ప్రసాదాసాదిత బహువిధ ప్రబంధ నిర్మాణితా నిదాన వరకవిత్వరకవి రామకృష్ణ ప్రణీతంబైన శ్రీవీర భద్రవిజయ మను గేయప్రబంధంబు నందు పూర్వ భాగము ముగిసెను.

శుభమస్తు.

శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాల కృష్ణపరబ్రహ్మణేనమః.

# వీరభద్రనాటకము

## ఉత్తరభాగము.

---

శ్రీరంజనరిపుభంజన। సూరిజనస్తుత్య దేవస్తుతాగత్య। సారజలము గ్వవుదిత।కృూరగృపాలహారి వేణుగోపాలహారీ॥

వ॥ అవధరింపు మగణ్యసాద్గుణ్యా పుణ్యావరేణ్యంబగు నైమిశారణ్యంబున సత్రయాగాను మోదులగు శౌనకాదులడిగిన మహానుభావుండగు వాయుదేవుం డిట్లని జెప్పందొడంగె. అట్లుహిమవంతుండు పార్వతీ పరమేశులనొక్కటిజేసి చక్కనంబోయిన నక్కలకంఠి యెక్కువ మక్కువతో చిరకాలం బుపచారంబుచేసి శివుండు స్థానుండునుంబోలె మహాలింగంబై యున్నవాడని సంభావించి సంభోగంబుకొరకు సమస్త విషయంబుల భక్తిభావంబుపరిణమిల్ల తదేకనిష్ఠాగరిష్ఠయై పరమేశ్వరైక్యాను సంధానంబు సేయందలంచి యిట్లనియె.

గీ॥ చేతులారంగశివునిబూజింపరేని। నోరునొవ్వంగహరికీర్తినుడువ రేని।దయయుసత్యంబులోనుగా దలచరేని।గలుగనేటికితల్లులకడుపుచేటు॥

వ॥ అని శ్రీమహాభాగవత న్యాయంబు గావున పరమేశ్వరుని పూజింపకంగాని ప్రసన్నుండుగాడుగదా॥ శ్లో॥ విశుద్ధజ్ఞానదేహాయత్రివేదీదివ్యచక్షుషే।శ్రేయఃప్రాప్తినిమిత్తాయ నమస్సోమార్ధధారణే॥

దరువు. మధ్యమావతి–ఆదితాళము.

ధ్యానంపరికల్పయామిదేవ మహానుభావ॥ధ్యా॥ధ్యానంపరికల్పయామి నాసాకారంనమామితి॥ ధ్యా॥ శ్లో॥ నిత్యానందాంతరంగాయ శూలనేలోకపాలినే శ్రేయఃప్రాప్తినిమిత్తాయ। నమస్సోమార్ధధారణే యిత్యాపనంపరికల్పయామి॥పంచచామరం॥రమామనోహరప్రియాయ రంజితత్రిశూలినె।ప్రమంతదానవాంతకాయభక్తలోకపాలినె। సమస్తభూతభావనాయశంకరాత్రిశూలినె। నమోనమశ్శివాయభవ్యనవ్యదివ్య

తేజసే॥ దరువు॥ ఆసనంపరికల్పయామి దేవ మహానుభావ॥అస॥ ఆసనంపరికల్పయామి అవ్యయానందంనమామిత్యాసనం॥ పరి॥ పంచచామరం॥భవాయసీభానుచిత భానుభానుసాక్షిణేన । హోనహోభవజనజ్జనప్రమోదకారిణే॥సువర్ణ కేతసేమహాతి సూక్ష్మరూపధారణే॥ శివాయతే నమోమునీంద్ర చిత్సరోజవాసినే॥ఇత్యర్ఘ్యంపరికల్పయామి ॥ పంచచామరం॥ సనత్కుమారి ముఖ్యమానిసన్నుతాయ పాకశాసనాదిదేవ పాలనాయ । పాలనాయసర్వలోకసాక్షిణె । మనోభవాయితోపమాన మంజులాకృతేనమస్సనాతనాయ। సాధుచిద్వశంకరాయ పాహిమాం॥ దరువు॥ పాద్యంపరికల్పయామి దేవమహానుభావ॥పా॥ పాద్యంపరికల్పయామి పరమానందంనమామిత॥పాద్యం॥పంచచామరం॥ నిరంజనాయ వాగ్విశేనిరీశ్వరాయయోగినే। పరాత్పరాయనిర్విశేషపావనాయశంభనే॥ నిరంతరప్రపంచపాలినెవమోమహాత్మనే । పరేశ్వరాయపారగాయ పావనాయపాహిమాం॥ దరువు॥ ఆచమనంపరికల్పయామి దేవమహానుభావ॥ఆచ॥ ఆచమనంపరికల్పయామి। ఆత్మారామంనమామిత్యా । ఆచమనంశివాయగురువేన్నమః॥

ఉ॥ శ్రీకరమానిమానస వశీకరనన్యపదారవింద। దర్వీకరభూషణానినుగురించిజపించి తపించివెండియున్నీకడచేరిదివ్యముగు నీనిజయోగసమాధిగాంచిని| ర్వ్యాకులనైనభానుశశిపావకలోచనమృత్యుమోచనా॥ స్నానం పరికల్పయామి॥ ఉ॥ మాయను జిక్కి దేవతలుమర్త్యులు మున్నగువారుదేవటే। వాయనమశ్శివాయయభవాయభవాయనమోనమోనము। స్తేయనినన్నుతించికడ తేరిరినేనీకుపూజజేసితి। భాయకు మయ్యభానుశశి పావకలోచనమృత్యుమోచనా॥

దరువు॥ వస్త్రంపరికల్పయామి దేవమహానుభావ॥ వ॥ వస్త్రంపరికల్పయామి వాసుదేవంనమామితి॥ వ॥

వ॥ చిలుకలకొలికిపరమేశ్వరుండుబలుకనంటివి పరిపరివిధంబుల బరిచర్యలు జేసినా పలుకడుగదె॥ దరువు. ముఖారి_ఆది.

పలుకడేమేశివుడు పలుకడేమేనాతో॥ ప॥ పలుకడుపలుకనిభావముదెలియని - తెలివితెలివిగా దలచుచునాతో॥ పలు॥ తిరిగితిరిగిమదికరగికరగితను - వరిగియరిగిరుచి మరిగిననాతో॥ పలు॥ తరుణేనంతట తానువరించుట_పరిహాసకమని భ్రమపడినాతో॥ ప॥ ఎందుకునందియమిందుకులోలో_యిందునమోదిచేయువాతో॥ పలు॥

వ॥ శంకరుండుబలుకకున్న నుసంకల్పభంగంబుగాఁగూడదుగదా!
ఉ॥ చీరెలుజినిగిదేహముగ్రశించికురుల్ జడగట్టిగాలియా। హారము జేసియిట్లుపురు పాతురనై నినుపూజ జేయునస్లీరవు జేర రావుగమనింపవు బ్రోచినబ్రోవకున్న నీ। భారముసుమ్ముభానుశశిపావకలోచనమృత్యుమోచనా॥ గంధంపరికల్పయామి అలంకరణార్థంఅక్షతాన్ సమర్పయామి॥
ఉ॥ ఓతరుణేందుభూషణ యోశివశంకర యిట్లనాథనా । ధేతిదయాంబుధేతినం దేతిజగద్గురు వేతియనంచు। స్ఫూతిమునమ్మినంగనులజూడవు క్రమ్మరిమాటలాడవే । పాతకమేమి భానుశశి పావకలోచనమృత్యుమోచనా॥ యజ్ఞోపవీతంపరికల్పయామి। శివాయగురవేనమః॥ ఉ॥ వేదములందుబు ల్ గిరులువిశ్వచరాచరజంతుజాలమిం। దాౖదుః లుసోమసూర్యులునహర్నిశముల్ భవదీయమూర్తిగా। సాదరమొప్పనినుగొని యాడెదనేలుము నేలకున్న నీ । పాదములానభానుశశి పావకలోచనమృత్యుమోచనా॥ పుష్పాణిపూజయామి॥ దరువు. శుద్ధసావేరి-అటతాళము.
నే జేయుపూజగైకొనుమా॥ రాతిదాజాంతరంగవారణనిర్మాంబరలీలగ॥ నే॥ మన్నించినాతప్పులన్ని తమించియీసన్న జాజులనుసురపొన్నలపొగడల॥నే॥ తెల్లదామెరవిరులనల్లగలువలమంచి - మల్లెలమొల్లలమారేడుదళముల॥ నే॥ జమ్మిదాసాన కాంచనపారిజాతములతుమ్మి పువ్వులమంచితులశీదళంబుల॥నే॥ ఇంకుకూరిపేట ధేందుజటానంగమింపొందంగనానావిధంబుల॥ నే॥ నానావిధపరిమళపుష్పాక్షతాదిపూజాంపరికల్పయామి॥ ఉ॥ ఆయతపుంగళాయభుజగాదిపరమ్యంరాయరోహిణీ। నాయకభానువహ్ని నయనాయమహేశవిరించివిష్ణుమా। పాయుపురాంతకాయపరిపంధిసురారిహరాయసాంఖ్యమో । గాయత్రిలోచనాయశుభగాయశివాయనమోనమో ॥ ధూపమాఘ్రాపయామి॥ ఉ॥ జారణకారణాయభుజగర్వమనాంధసంహరాయసం। సారమహార్ణవజ్వలితఛండమచాపహరాయదేవతా। స్ఫారకిరీటకూటమణిబంధురపాదపయోరుహాయఓం। కారమయాయభక్తజన కల్పకుజాయనమోన్నమోన్నమో॥ దీపందర్శయామి॥ చ॥ ఋతుసంవత్సరమాసపక్షనియమాకారూఘాయనానాధ్వర। వతరూపాడువృషధ్వజాయజల భూవై శ్వానరవ్యోమమా । రుతరూపాయశిఖండధన్విరధినియాపాయయోగీశ్వరస్తుతే । పాదాపానమోన్నమో శివనమస్సోమార్ధచూడామణీ॥ యథాభాగనానావిదఫలోపహారనైవేద్యంసమర్పయామి॥

వ॥ బోటులార నాటంగోలె నేటివరకు నానావిధంబుల పూజించినను నాప్రాణనాధుని నోటిమాటకే కాటకమాయెను। శివాయగురవేనమః॥

అశ్యదేశము-దరువు-కమాసు-ఆదితాళము.

నోటిమాట కేకరువాబరువాపరువా శివ॥ నో॥ హాటకచలాశరాసనాథవామహానుభావ॥నో॥ భుజంగభూషణపురాణపూరుష నిజంబుగా నినుభజించినందుకు॥ నో॥ రవిశశిపావకనయనా కవిజనమానసభవనా-భవాభవాయిూప్రకారమున జేతువేమిగతిపల్క వేమిచేసితి॥ నో॥అరయ నమ్మినానుబోశివపుచ్చిబుట్టిలాయనందురా- విధంబున మొరాలకింప కేమిసామి॥ నో॥ సామివిగావాసరసత లేదా యేమనరాదాఅదిమరియాదా-రామరామయెందుకిట్టిరట్టుమెట్టికష్టపెట్టి ప్రేమమిూరియిందుకూరి పేట జేరిపల్క వేమి॥నో॥ శివాయగురువేన్నమః॥ మధ్యేమధ్యేపానీయంసమర్పయామి ఉత్తరాపోశనంసమర్పయామిసాంబప్రక్షాళనసమర్పయామి శుద్ధాచమనీయున్సమర్పయామి॥

దరువు॥ తాంబూలంపరికల్పయామి దేవామహానుభావా॥ తాం॥ తాంబూలంపరికల్పయామి తత్వాతీతంనమామితి॥ తాం॥

కం॥ అనుచరిసుబ్బరాయం। డనుసూరిజనోపకారి ననయము బ్రోచే।వనుచూభూరిజనంబెల్లను। చూరెలనాడు చుందలంతురునిన్నున్॥

వ॥ అట్టినినుబుట్టినది మొదలిట్టిపనులు జేయుచుఘట్టిగానమ్మినను పల్కవు॥ మంగళహారతి. కాంభోజ-ఏకతాళం.

దేవమంగళం మహానుభావమంగళం - దేవతాసార్వభౌమదివ్యమంగళం- నాగభంజనాసమస్తయోగిదలపనా భాగవతానుమోదదివ్యభవ్యమంగళం॥ భువనమోహనా నిరంతరబుధజనావనర్ధశశిపావకలోచనాభిరామమంగళం॥ నందివాహనా సమస్తానందదోహనా - యిందుకూరిపేట శ్రీమహేశమంగళం॥

వ॥ ఇక్కడివృత్తాంతం బిట్లుండె, అంతపరమేశ్వరుండు పార్వతీ జేయుపరిచర్యలు బాహ్యంబునకులీరి గ్రహింపక యంత రంగంబునకంతయుంగ్రహింపుచు నన్యోన్యసమ్మేళనసమ్మావలోకనంబులు లేకుండుటంబోలె నిర్వికల్పసమాధి నున్నంత కొన్నిదినంబులకు తారకాసురుండలిగి బృందారకాదుల ననేకవిధంబుల బాధింపందొడంగె నందుకు బృందారకులు కుందలలంబొందుచు పురందరాదుల గూడికొని పోయి యరవిందభవు నంతర్యామంబుజేసి నారాయణు వేసిన నతం డిందాదిదుల

యాక్రందనంబు మాన్పి సంక్రందనుం జూచి యిట్లనియె. ఇంద్రా! నీవు శీఘ్రంబున మన్మథుని రావించి సంభావించి మర్యాదలు గావించి యతని మహామాయమయంబైన సాయకంబులచే పార్వతిపై నీశ్వరునకు మరులు బుట్టింప జేయింతువేని నక్కారణంబున తత్సన్నిధానంబు సంగతిప యదినంబులనుండి పూజించు నీశ్వరిపై మోహంబున నీశ్వరుండు పెండ్లి యాడునంత నాదంపతులకు గుమారుండు కుమారుండై పుట్టునతండత్తారకాసురుని వధించి మిమ్ము రక్షింపగలవాడట్లు జేయుడని పరమేష్టి యానతిచ్చినవిని దేవతలును తమనివాసంబు జనుదెంచరింద్రుండును తనపురంబు జేరి తారకాసురునివలన భయభ్రాంతులై బరతెంచు దేవతల రావించి సమాదరంబుగా నిట్లనియె.

సీ. అమరేంద్రాద్రిదుడస కన్నసీలోపల జయించె వహ్నికి తనకోప
వహ్ని జూపె। నంతకుదాయంత మూర్తియై యసురులకసురమై యలవు
మెరసె। నీరధీశ్వర సొంపు నీరుగానలయించె గాలిబీరము నెల్ల గాలి జేసె।
నెనయంగ ధననాథు నిర్ధనుగావించె హరుని బలంబెల్ల హరము జేసె। నమర
గంధర్వ రాక్షస యక్షసిద్ధ। గరుడపన్నగ మానవమునీంద్ర। చయము నెల్ల
నుబలు మారు జంపి శౌర్య। భాసురుండగు నత్తారకాసురుండు

వ॥ అద్దానవాధమునకు శీఘ్రకాలంబున హాని వాటిల్లున దెట్లంటిరేని॥

దరువు - నాట- ఆదితాళము.

వలదు వలదు దేవతలార భయపడ॥ వ॥ బలవంతులు గారు తొందర పడి చెడిపొయ్యేరు- వినుడీ ఖలుల బలుల దనుజుల మీరే గెలువగలరు గెలువ గలరు॥ వ॥ సకలము దెలిసినవారలు మీరలు సంశయపడదగునా- యిపుడే యకటకటా తారకదైత్యేంద్రునికదరి పెదరనగునా తెలిసీ- తికమకలై చాలా మట్టుమధృతి చెడిపోనేల వినుడీ యొకసదుపాయంబున్నదిదిలో గుండకని లుడీ నిలుండిక చిడిముడిబడ॥ వ॥ గీర్వాణులమటుమనకే చాలాకీడు జేయువాడు- మనుజుల సర్వస్వము నిచ్చలవిడి గాభక్షణజేయుపోడు- పూని గర్వపడిన వానిదై వముకట్టి నుడుపు గానివినుడు- పూర్వదేవతల పాడవడగు యసురలుర్విజనులు సుఖముందురు॥ వ॥ అంపరు వినుడా హైమవతికి ఖండేందుమౌళి ఖామణికి గలిగే- నందనుడా దానవునిం గూలుచు నందాకాతలగి- యిందు కూరిపేటానందర మొకఛోట- యిట్లరవిందభవుడును - నంపరు వినిముదమం దదెల్పనిక నటుయిటు తడబడ॥ వ॥

వ॥ అని చెప్పి పురంధరుండు సుధర్మాసీనుండై తనకు విధాత చెప్పిన చందంబున మన్మధుని వలంచె నట్లనిన॥

సీ॥ భాసిల్లుపువ్వులభాణపఙ్క్తులవానికోమరారు కెందమ్మిగొడుగువాని। కలహంసములవానికలకంఠములవాని వెలుగొందుతియ్యనివింటివాని। మందానిలమువానిమదభృంగములవాని తెరగొప్పపువ్వులతేరినవాని। బలుమీనుటెక్కెంబుబరగనొప్పెడువానినామనిసారదియైనవాని॥ నాత్మబుట్టినవానిసకలంకశృంగార।విభవలక్ష్మిచేతవెలయువాని। మోదవృత్తివానిమోహనాకృతివాని।మదిదలంతునేనమస్కరింతు॥ వ॥ అనిపురంధరుండు విపద్గతావశుండై తలంపరానిమనంబున మనఃపూర్వకంబుగా దలంచిన యవ్వసరంబున కందర్పుడు నిజమందిరంబున దనకులకాంతయగురతీయింతితో నేకాంతంబున నిట్లనియె.

ద్వి॥ ఓసఖీమణివినుమోరతీరమణి-నాసవిస్తారమంతయుతేటబరతు-పూబోణియీ లేదు భువనంబులందు-యీబాణపఙ్క్తులకెదురెందు లేదు-మూడుమూర్తులనైనముంచునాసాయ-వారువీరననేలవసుధనెల్లెడల-మరియునీసుల్లికామాలతీలతిలు - విరిసినయీమాధవీజాతివిరులు-రొచలనింపొందవుసీలోలంబములును- మదినొప్పుచల్లనిమలయమారుతము-మావసంతవిభూతిమంచిగంధములు-భావింపనిటువంటిపండువెన్నెలలు-రమణీయదివ్యహర్మ్యప్రసాదాదు-లమితంబులస్మన్మహాసాధనము-కలములవిజయమంగళగానరవము - చిలుకలుకోవెలల్కీరిలాలిగాగ-నావంకనెనబది నాలుగుకోట్ల-జీవరాసులుగూర్మి చెలువొందుచుండు-యిదియేమియిదియేమియీవిచిత్రంబు - ముదితనాదేహమేమొగంపమొకందె-యేమిదుమొబంధులెవరువచ్చెదరో-భూమినేవింతలుబుట్టునోగద్ద వే॥

వ॥ అని మరియు నిట్లనియె.

దరువు. సంవాదం. మధ్యమావతి-ఆదితాళం.

ఇదియేమోయిదియేమో దెలియదుమదవారణగమన- సదమలగాత్రిసరసిజనేత్రి - అదరుబెదరులేనియీశరీరంబదరుటేమి బెదరుటేమి చూడవే॥ఇ॥ బహుమేలిదిబహుమేలిదిదీనికితహపడనగునా - సహజమెగాదా శాస్త్రములేదా-విహితులెవరొనినుపదిదలంచిరి వినుముమునముగదురనేటికి॥ ఇ॥ కనుచేతుణిసక్కనుమదిదెలసెనుసమరసభావము- అమరేంద్రుడుమున్నుగు దేవతలుమహాసంతోషమున- మమతలు బెంచిమనలదలంచి- నిజమమహామెనెందుకోబలుమల్పడ దమితమామెనదరుబాటు కోమలి॥ఇ॥ సందేహపడనేటికిసమ్మోదికేజయప్రదమెగాని-ముందిట్టిదరినవారిట్లాదిగులొందరింకపోనీ- యొందుకుచింతనొందకుమింతయిందుకూరి

పేటహారిహారాదులుముందు వెనుకతోడుసీడలాడుదురు॥౩౫॥

వ॥ అనుచున్న యెడనింద్రుండింది రానందనుండిందు రా నెందుకుద డవా యనోఅని లేఖలబిలిచియొక్క లిఖితంబు లేఖనంబు జేయించె నెట్లనిన.

ద్విపద॥ శ్రీమతు మోహాలక్ష్మీపుత్రులైన-తామసరాజద్వయము క్తులైన-సంకల్పపట్టణాస్థానికులైన-పంకజాంబకులై నబహుళప్రపంచ-ని ర్మాణతానుసంధీభూతధర్మ-మర్మకర్మాది కామ్యాన్నయజ్ఞులైన- భూరిసం సారికాద్భుతగుప్తులైన-సూరిజనాటోప సూదనులైన-బహుతరుణోయు ద్ధానురాగ-సహజసాకవిపాక చరణశీలులైన..బ్రహ్మచర్యవ్రతభారఘ్నులైన-జింహాచరణబహుజీవఘ్నులైన-కలితనవద్వారగార్హస్థులైన-కలిత సర్వకాలకళామయులైన- వేదశాస్త్రపురాణ విషయానురాగ-నాదభే దాదికవ్యవసాయులైన- బలమదోద్రేకసంపత్కరులైన- కలిమి లేములు రెండుగలవార లైన- చిలుకలుకో వెలల్ చెరుకు విగుల్లు-నెలయాదమినా మనీయళి మొసలి-మున్నగుపరివారములుబిరుదులుగ-నున్న వారైన లేపు న్నవారైన-త్రిభువనాంచితదేవతిర్యగ్మనుష్య - విభవసామ్రాజ్యైకవిస్తా రులైన-భోజనభాజనపుంజసంజాత - బూజవామోదకాద్భుతరాజమా న్య-రాజపూజితులైనరమణీయులైన- వలరాజుశారికివాసవుదిచ్చు-దలగ కపదివేలదండములెట్టి-కామితోన్నతి జేయగలవిన్నపములు- మేముసే మంబిందుమీ క్షేమమందు-వ్రాయించి కంపించ వలయుతర్వాత-ఈయు త్తరము వ్రాయుటెందుకంటేని-కూర్మిమీతో కొన్నికొన్ని సంగతులు-మ ర్మమర్మంబులు బాట్లాడవలసి-యింతకుముందుమిమ్మిచ్చదలంప-నెంతయు రాదిదియేమి కారణమో-యెరుగనుగావునదీనిభావంబు-కలిసిగ్రహించి తత్క్షణమేమీరిందు- వచ్చిమాటాడిపోవలెనదిగాక- విచ్చేయుచో లోకవి స్తారమతిని-మునసిమేమిట్లు యెమోవ్రాసినార- మనిమెంచబోక నేడశ్ర ద్ధసేయ-దలపక మీరాగత్యంబె రావలయు - చెలిమిమిక్కిలొనర్చినమిము బోటి-ఘనుల కెక్కుడువ్రాయంగబని లేదు-గనుక యోచించిముఖ్యంబుగా నేటి-కచ్చుటనెన్ని కార్యంబులుండినను- మునసిమీథాంతర్యమునకు దేవ లెను-గినుకబూనకచిత్తగించవలెను-ఎనసిమీస్నేహితుడింద్రుసివ్రాలు॥

వ॥ అనిలిఖితంబు లేఖనంబు జేయించిదవ్వారి చేబుత్తెంచిననతండతి వేగంబునరతిమన్మథులున్న చోటుకుంబోయి బుత్తెంచినసందేశంబుజెప్పి సదుత్తరంబిచ్చినమన్మథుండురతీ దేవివినజదివిసంతసించిరతితోనిట్లనియె॥

సీ॥ అతిమోహనాకారయుద్ధ వతికో.. నవశృంగారుడైన

వాని। కలిమిమైమూడులోకంబు లేలెడివానినొడలెల్లగన్ను లైనొప్పువాని। పొలుపార కేలదంభోళినొప్పెడువానిసత్యంతవైభవుండైనవాని। కేయూరకంకణాంకితబాహువులవానినెమ్మైనమణికిరీటమ్ముగానిగరుడసిద్ధసాధ్యగంధర్వకిన్నర బుజగపతులుగొలువలుపుమిగిలి । తేజరిలువాసి దేవేంద్రుడగువాని మదిదలంతునేనమస్కరింతు॥ వ॥ అని రతీదేనింజూచి॥

కందార్థం॥ నను దేవేంద్రుడుబిల చెను।పనిగొనినేడేమిమైనపంకజనేత్రి। తనకేకార్యముగలిగెనో పని లేకదలవనితడు భామినివినవే । కలహంసగామిని-ఈషుజ్జగములనేలువిభుండతడేమే మోపనులెన్నెన్నో విను॥ భామినీ॥ వ॥ అసినరతి నీవుమహామాయరుండవుసమస్తజనసౌఖ్యదాయకుండవు చెప్పరాని విచిత్రంబులు చేయుకుండవు నన్నెడ బాయకుండవు నాప్రాణనాయకుండవు గావున,

కందార్థం॥మదనానినువిడచినని । ల్చునామది నేనువచ్చివచ్చుటకిదినా। కదునాయమరేంద్రసభా । సదనాదులజూతునింతెచాలును।నినుజూడకతాళజాలను। యీలాగునన్నింటదిగవిడచి యేలలనలకడకేగెదవోచాల్॥ చాలు॥ వ॥ అనిన నతండిల్లనియె॥

అశ్యదేశము దరువు సంవాదం-యమునాకల్యాణి.

రతీసతీనామాటవిన వెంతీ రతీసతీమానితోన్నతీ॥నా॥ హితమతినుండకసతిపతిమాటలకతిగడచినమరియాదటవె॥నా॥ మనోభవానికేమికొదువా మనోభవాశ్రితనూభవా॥నీకే॥ నినునాడనీనీకతిగడువని ననువిడనాడుటనాయమా॥నీ॥ జగతిని వేశ్యలు సభలకుబోదురు మగనాలికిబోనగుసటవె॥నా॥ ఇందుకూరిపేటాధీశుడునిల్పినయింద్రుని సభానేనెరుగనానీకేమికొదువామనోభవా॥ వ॥ అనినమన్మథుండు॥ స॥ ఇల్లాంధ్రయినకులాంగనల్మగలతోనేతెంతురా తెల్లికో । భిల్లకకోవిదులున్న రాజసభకుంచిబోష్టినీ వేగుమా।యిల్లాం!డెవ్వరుబాణివల్లభులతో యిట్లాడగానేర్తురా। సల్లాపంబులు దేవతాసభలునీసాంకేతశైలంబులే॥

వ॥ అనిరతినివీడ్కొని నిక్షుపిల్తుం డింద్రపురంబుజేరినయచ్చటి పురస్త్రీజనంబు॥ లయగాహి॥ తెమ్మెరలు పెక్కు మురిపమ్ములవెన్క-ముసరిరఘుమ్మరనిపదముకురమ్ములుమహాశంఖమ్ములశశినెమ్మి వెలయక-బాగడుసమ్మదపుచిల్కలరవమ్ములుజెలంగక-గ్రమ్మికలకంఠములునిమ్మగుమరాళములసమ్మదపుగాలిగడుకమ్మకొనివీవక కమ్మనగువిల్లుపూటమ్ములనుబట్టి ఉవరత్నలను పువ్వులరధమ్ముపయిఁవచ్చె॥

వ॥ ఇట్లువచ్చినంజూచి కొందరిట్లనిరి॥

గీ॥ శ్రీమదనుసూగివంశాబ్ధి సీతభాను। డనగ బెంపొందుసుబ్బరాయాభిదాను। డనఘుమెవ్వానిగొనియాడున ప్ప్రహాను। భావునితనూజుడల పంచబాహుడగును॥ ఆనందభైరవి-ఆదితాళము.

అమ్మమ్మాయితడేనరే ముద్దుగుమ్మలార॥ యీ॥ యెమ్మెకాడే నమ్మచురుడుకొమ్మలార॥ సరసుడేచక్కని వాడుగ దేచానలార॥ ప॥ తరుణి పూజాఫలమేమమ్మాచానలార॥ అమ్మ॥ కనులారజూచినజాలుగదే కాంతలార-మనతోమనసుదీరా పలుకడేమెసుగువలార॥ అ॥ చేరబిలచినరాడే మెచెలియలార-యింపుకూరిపేటా జేరు నేమెయువిదలార॥ అ॥ వలని మరియుంగొందరిందువదనలిందిరాసుందరీనందనుండగుకందర్పుండనితదీయ లావణ్యతారుణ్యాది పుణ్యసౌందర్యకాసారాద్యవిశేషంబుల కానందించుచునిట్లనిరి. సీ॥ కమనీయసంఫుల్లకమలాక్షియితడే కామినీమోహనాకారవరుడు। సలలితసంపూర్ణచంద్రాస్యయితడే బిరుదుమెండగుగండబిరుదువాడు। ఘనతరమత్తగజయానయితడేపంచబాణంబులబరవుఘనుడు। కొమరారునవపుష్ప కోమలియితడేలలనలపురులగలచుమదనుడితడే। లోకాభిరాముడునంసారనటనాంచితసూత్రధారి కాముడయితడే। చతురానందముయుండీభూతకోట్లనెల్లయితడెబుట్టించుబెంచునితడె। సమయింపజేయునితడెమహాసుభావుడు॥ వ॥ అనుచున్న సమయంబున మరుండుదిరంబునపురంధరుమొగసాలకేరుడిగ్గియాస్థానమంటపంబుజొచ్చిననింద్రుండెదురేగిసత్కరించియాలింగనంబుచేసి యొక్క హేగంబాసంగిసింహాసనంబునగూర్చుండనియమిచిన కాముండు సంతసాభిరాముండై యిట్లనియె.

సంవాదం దరువు. శేగుప్తి-అటతాళము.

వందనముదయ్యపురంధరదివిజవందితలోకైకసుందర। సుందరంబగు నీముఖాబ్జముజూడకన్నులపండువాయెను- మందరమధురాలాపములువినిడెందమత్యానందమొందెను॥ వ॥ అనినయింద్రుండిట్లనియె॥ జో॥ హరుగోవిందనందనా త్రిజగన్మోహనవిశ్వైకబంధన- స్నేహభావముబెంచిమదియుత్సాహముప్పనయము నెంచిమాసందేహములుఖండింపందగునన్నామునదయచేసినాడవు॥ జో॥ దేవేంద్ర పూశేల్లక్షేమమాయాదివిజాసులందఱుకుశలమా - నీవుమహాసింహాసనండవయుగని సపమానవిభూతినోము న్నావిధంబునజేసితి సూకళ్యమేనక్రతువులవహాభళి॥ వ॥ ఆరీతియిపుడెట్లాదరుగనుయింమహా... ...వసంగలిగిము

 

బృందారకాదుల నెల్లభంగుల ఘోర బాధను జేయునదిగడ తేర నేరకనూర
కుందుచుు జో॥ వ॥ తారకాసురుండు మీకు మాదుండై మీరుగడ తేర నేర
కుందుదురాయనినం దేహింతు వేని॥

క॥ వారిజగర్భునివరమున। దారకుడను దానవుండు తద్దయుగడిమిన్। 
గారించె నెల్లజగములు । భోరునగడ తేర రెట్టి పురుషులవలనన్॥

వ॥ ఇందుకుసదుపాయంబు పార్వతీపరమేశ్వర సంయోగంబందు
వలన కుమారసంభవంబు గావున, క॥ పురహరునకు నద్రిజకుం। బరగన్
బ్రభవించునట్టిబలియుడు వారిన్। బరిమార్చు నద్రిపుత్రికిని। పురహరులకు
గూర్చి కీర్తిబొందుము మదనా॥ వ॥ అనిన మన్మథుండిట్లనియె. క॥ తలుపులు
మరపులుదనులో। పలమరచిని రాశవృత్తిపరమేశుడుచా। గలడింతే దీనిను
డువడు। సులుగడచినవాడు నాకు జోరతెర వేదీ వ॥ ఇదియునుంగాక,

సీ॥ పుండరీకాక్షునిపుత్రుడనై యుండియీశ్వరునిజయింప నెట్లుబో
దు। పోయిననద్దివ్యభూరితేజంబులో నెనయంగనా తేజ మెట్లుమోగు।
మోగినపరమేశుమూర్తి యేగనుగొని యెదిరివిజృంభించియెట్లువత్తు। వ
చ్చినమాత్రం డివాపిరిగోపించి యేమిదండించునో యెవ్వడెరుగు ॥ వెరతు
నయ్యయెన్ని విధముల జెప్పిన। కొలదిగాదు నాకగోచరంబు। నిక్కమివ్విధం
బునీయాన దేవేంద్ర । సింగమునుజయింప జింకజనునె॥

వ॥ అనిన యింద్రుండిట్లనియె,

సంవాదం దరువు, ధన్యాసి-ఆదితాళము.

నీకంటె మహానీయ్యు డెవ్వడు లోకములో లేడు-యీ కార్యంబునకై
కమలాక్షుడు మాకు నిన్నుతనమారుగ బంచెను॥సీ॥ వ॥ అనిన మదనుండు,
శివుని గురించి జయించేపని నాచేతగాదు కాదు-తవిలి చరాచర దానవమా
నవనివహములో కెగవయ లేని పరశివు॥ వ॥ అనిన యింద్రుండిట్లనియె.

గీ॥ పొందుగానిపనికి పొమ్మనదు నేనిన్ను। యింతచింత యేలయిట్టి
పనికి । దర్పచిత్తుడైన తారకాసురు చేత। బాధమాన్పి కీర్తిబడయుమయ్య॥

వ॥ అని వేడి నీవోడినవాడవైతివి॥

దరువు॥ ఇక నేమున్న దియిట్లా నీవనుటకు గాదుకుమారా- వింటిక
చిన యీ విశ్వంబంతయు తికమక జేతువు ధీర విచార॥ సీ॥ అనిన మరుండు॥

దరువు॥ మానిసివ లెను న్నాడతని గెలువందగునని యన్నావతడు- కను
మూసిన లోకము మాయును మరికను దెరచిన లోకము వెలుగును, పరశివుని

గీ॥ కొలదిగాదు జర్చి కోపించె నేని। విరించినైన శిరము ద్రుంచుగాని॥

శ్వనాథవిబిరుదువిన్నా డగన్నా డ-నభవుచేర వెరతునమరనాథ॥ వ॥ అనిన యింద్రుండు. క॥ యంతపనిరైయినమునుకొని। నంతంబున జేయునీవుభయము ననకటా। చింతింతువుపలుమారును। చింతించుటనీకుదగునెచి త్తజవినుమా

దగువు॥ నీవేతప్పుయితేఃపర మెరుగమునిజమునిజము ఘదనా-మీావా రమునమ్మినాముసు మేన్మ్రోవను బొమ్మందువోభువిలోన॥ నీకంటె॥

వ॥ అనినమదనుండు మరియు ప్రచండమార్తాండ మండలమండితోద్దండ తేజోవిజిత దుర్నిరీక్ష్యకుండలాభరణుండునుకఠోరకుఠారగదాదండభిండివాలకరవాలముసలముద్గరతోమరప్రముఖ నానాయుధపరివృతబాహుదండుండును ప్రళయసమయఘనాఘనధరఘూర్జితనిర్ఘాతనినదసన్నిభసకలభువన భయంకరసింహనాదుండునుభుజంగరుద్రాక్షమాలికావిభూతిత్రిపుంద్ర శార్దూలమకుటవామజాజితనధరుండునువిలయకాలనిలహేతినిభనిదాఘనిశ్వాసుండునునిఖిలలోకప్రతిష్ఠితసాహసుండునునిజారాతిసంఘాతనీరస గహనక్రియాకళావ ధూమకేతుండునుదైత్యదానవవిదారుండునునిరుపమాననిర్మలనిర్దోషనిర్వాణనిరంతరనిర్విషయనిరానందమానసుండును సకల బ్రహ్మాండసందోహ విలంబితపరమభద్రాసనాసీనదవ్యయోగధ్యాన సంభరితాంతరంగుండునునిర్గుణుండునునిర్వికారుండును నైతనంతటతాను దలపోయుచు నశాంతసచ్చిదానందమయుండై యుండు నప్పరమేశ్వరుని యెవ్వరుజయింపఁజూతురు॥

దర్ప్వ. ఏలానను ప్రతిమాలుట నిజముగ కాలకాలుడతడు-యేలోకంబునయిందుకూరి పేటేలుచున్న పరమేశ్వరుడైన శివునిగురించి॥

వ॥ అనిన యుగ్రుండిట్లనయె.

సీ॥ కలకంఠగణములకలనాదములతోడకలహంసనాదంబుగిడలుకొనగ। నమరుడాకాలిపెండారనాదంబుతో ఝుంకారనాదంబుజడికొనంగ। భూరిసుందరరాజకీరనాదంబుతో వెడవింటినాదంబువీకొనంగ। నందంగ॥ శరవేగనాదంబుబురికొనంగ॥ కదసివెన్నెదచెలరేగియార్చునాదంబుతో శరవేగనాదంబుబురికొనంగ॥ కదసి వెన్నె లగాయంగకమ్మగాలి। మెలమిపీవంగపువ్వువింటనెక్కుబెట్టిశరముసంధించివైచినశంకరుండు। గలుగునందజగమమ్మెల్లగావవయ్య॥

వ॥ అని వినయంబును విధేయంబును భయంబునుసందడిగొనం బురంధరుండు కంతునికాశాంతుండై బహుభంగుల ప్రతిమాలినతాను దానవాంతకుని సూన్యుండయ్యును దీనపాలనంబు మానుటగాదనిశరణాగతుండైన నింద్రునకు ధైర్యంబుసెప్పి యిట్లనియె.

ఉ॥ బంటుతెనంబు పెంపెనగ పచ్చనికార్ముకమెక్కు బెట్టిమా। యొంటరిజోగి యైనశివయోగిసముద్రము నాదుకోలలన్। రెంటలు జేసిశీఘ్రము సనిక్కముగా జలిగొండకూతుపు। ట్టింటికిగారి వెంటజననీశునిలో బరతుంబు. వందరా॥ వ॥ యుద్ధసన్నద్ధతాంబూలంబు దెప్పించుము యింక నేబోయి వచ్చెదనని యిందాదులవీడ్కొని కంతుండు బలాధిమంతుండును బోలె మంతనంబున చింతాక్రాంతుండై వచ్చి యంతఃపురంబు సొచ్చినం గనుంగొని రతికాంతయిట్లనియె. దరువు. హిందుస్తాని కాపి-అటతాళం.

నగుమొగమిలాగున వాడిన దేమిసామి॥న॥ సిగనిగవగ లెగయగదగు సొగసగునుపలుకకము న్నె-పలికేడిసీవిప్పుడు పలికిపలుకవు పౌరుషమా-అలుకతో జరుగుదువలియనిసొలియని॥న॥ యెక్కడిమాయ యెవరికి దెలియదువాక్కోశవేళ యిది - కయితవమాగ్రక్కు-సమదిమదిగలుపవు తెలుపవుని॥ న॥ యెందుకయిన యింద్రునిపనుపున పొందిననీమది సందియమా-యిందుకూరి పేర్ల జనులందరునిన్నందురునీ॥ నగు॥ వ॥ అనిన మన్మధుం

సీ॥ నాతియిక్కడనుండి నాకంబునకుబోయి యమరావతీపురంబమర జొచ్చి। దేవకాంతలు రెండుదిశలుచూచుచునుంట దేవేంద్రు మొగసాల తేరుడిగ్గి। పోయి మ్రొక్కిననన్ను పొలుపార మన్నించి నాకాధినాధుడు నన్ను జూచి। బాలేందుమౌళికి పార్వతికన్నెను గూర్పంగవలె నారిగౌషురు చేత॥ దారుణాత్మకుండు తారకదైత్యుండు। వేగననుచు జెప్పివీడుకొల్పె। వనితతగవు పడసి వచ్చితిదండెత్తి। పోయి యిపుడ శివుని పోరవలయు॥

వ॥ అనిన విని మూర్ఛిల్లి యల్లనందేరి యిట్లనియె.

సీ॥ నిఖిలప్రపంచంబు నిర్మించి శోభిల్లు పరమేష్ఠికంటెనీ బలము బలమె మూడు వేల్పులబట్టి మూలకుజొన్పినకరిదైత్యుకంటెనీ ఘనతఘనతె। ఘనభీకరాకారకలితుడైము త్తిల్లులయకాలుకంటెసీ లావులావె। కలదైవములనెల్ల ఖనిడించి వైచిన యంతకుకంటెనీయరుదు యరుదు॥ మెట్టిఘనులబట్టి యనయంబు తలగోసి। ద్రచ్చివిడిచి త్రుంచివ్రాలినాడు। వలదు శివునితోడి వైరంబు మన్మధా। యూరకుండి జచ్చువారుగలరే॥ వ॥ అని మరియును.

సంవాదం దరువు. ముఖారి-అటతాళము.

వలదు వలదు ప్రాణనాయకా-నీకీ వైరమెందుకు పంచసాయకా॥వల దువలదు మహానుభావుడు వామదేవుడ వేదవేద్యుడు - బలిమికొలదిం దెలియ నేరవు గెలువజాలవు గెలువజాలవు॥వల॥ కాని లేకలహంసగామిని యిపుడైపైనమై పోదునే భామిని- సనుట యనదెట్టిదింద్రుడు తానుబనిచిన దెట్టిది

ష్ఫుడు తానొకటిదలచిన దైవము తానొకటిదలచినట్లాయను॥ కాని – యంత జెప్పినవినక పోతివి–పోయి సంతాపమునొందనైతివి– కొంతదడసినవగవ పలెకొకంతదడసినవగువనేటికి–యింతకంతకుపంతమెందుకుమంతనంబున నింతజంతిల॥ వల॥ గౌరిశంకరులనే నెరుగన–యిందుకూరిపేట నెకలతజరుగున–వారువీరై తేసరేనా పేరుమన్మధుండై సురేంద్రుడు గోరినట్లయుమామహేశులగూర్చ లేనిది పౌరుషంబకే॥ కాని॥ వ॥ అనిన రతిపతితోనిట్లనియె.

శా॥ కల్లోలధ్వనిమంత్రజాలములు లోకంబెల్ల పాఠీనముల్। నల్లాలిత్యతసద్విజుల్ మణులునక్షత్రావళుల్ ఫేనముల్। దెల్లంబైన త్రిమూర్తులూర్మ్ఖగతుల్ దివ్యప్రభావంబురం। జిల్లంగాజలపూరసంకులముగుణ్ శ్రీకంఠవారాశికిన్॥ వ॥ అనినవిని కందర్పుండిట్లనియె.

దరువు. నీలాంబరిరాగం–ఆదితాళము.

అయి తేమ రేమా యెపహా భళిభళి మేలాయ॥ అ॥ నీతనై నంతాబూని జేతు నేమైనాగాని॥ అ॥ యిందునన్ను బోరే వారుముజ్జగంబులలోలేరు–మందయానా యీశివునిమహిమ లేమైనగాని॥ అ॥ అతివమన కేమికొదువే నహ మాటలాడుదు నె–మతిగల దాన పేనీమాట లేమైన కాని॥ అ॥ ధాటిగా యిందుకూరి పేటకీక్షణము జేరి–బోటిరో వానిదాని పొందుజే యింతుగాని॥

వ॥ అనిన రతి తనపతింజూచి యిట్లనియె.

సీ॥ ఇవ్వసుంధర తేరు పువ్వుల తేరును నిజ్జరభటులును నీరభటులు। కనకాచలము విల్లుగడుదియ్యనగువిల్లు మేటినందియుబడగమీనుపడగ। బహుమంత్రములవాజుపచ్చనివాజును పెక్కు–తలలనార్చి భృంగనాది। నలుమొగంబుల సూతినవవసంతుండు సూతి పురుషోత్తముండమ్ముపువ్వటమ్ము॥ వెలరేయుబవలు వెలిగించు। గండ్లును త్రిపురదైత్యకోటిగురిపిటవజ్రంబుగురియాతనికి। నీకు నేమి జెప్పవచ్చు నెంత కొంత॥ వ॥ అనిమరియును,

సంవాదం దరువు. బిలహరిరాగం–ఆదితాళం.

నీ వెరుంగని దేమున్నది సదయా వినుమిటువలె నందరునా॥ యేవిధంబున నీవుధరింతువు శైవమహా బలజనసాగరమది॥ సీ॥ వగలాడి తెలిసి తెలియకనను బోనాడెద విదిమరియాదటవే– వాడుననుబోరాడున టెనాతో డిలాఘ్నసత్తువ లేడవి॥ వగ॥ అనిన రతియిట్లనియె.

సీ॥ ఖద్యోతబింబంబు గర్వంబు నేర్చునే పరగ తేజోగ్రదీపంబుమీద। పరగ తేజోగ్రదీపంబుశోభిలు నేయ ఖలంబుఘోరదావాగ్ని మీర। నఖలంబు ఘోరదావాగ్ని బెంగేర్చునే జవలింటి భానుబింబంబుమీద। వెలిగొందు

నేబవలింటిభానుబింబంబు వెలిగించు నే ప్రళయ కాలానలప్రభలమీద॥ ప్ర
ళయ కాలాగ్ని కోటిచే ప్రజ్వరిల్లు ।కంటగలమంటబరగుముక్కంటిమీద।
వాలిలనేరు నెనీపెంపుదూలుగాని । జిత్తజగద్వీటసంఘాత చిత్తజాత॥
దర్వ్యా.లావుసత్త్వ లేమిటికినీలాలనవిషయము లేమిటికి- దేవ దేవుని త్రిజగ
జ్జనుని కేవలమొక్కసైగెలువంజాలమి॥సీ వె॥అః నమన్మథుండు ॥ యెందుకత
నిండ చెందవునన్నెందుకుతగవుకు బిలి చెదవు-ఇంచుమాళిగెలి చెద నేనిందు
కూరిపేటులు సనే॥వగలాడితే॥ వ॥ అని వెండియునిట్లనియె.

ద్విపద॥అలి వేణినా మహత్యం బెల్ల వినుమా-కలకంఠకంఠినిక్కము
దాపనేల-వానిమహాత్యం బెవర్ణింతునకట॥

శ్లోకం॥ధృతాస్థిమాలాంచితసర్వభూషణః।స్మశానవాసిసకపాలభో
జనః । పశ్యామికాషాయవిభూతిధారణశ్చద్బ్రహ్మచారీశటిభిక్షుకోశివః॥
అనుటవలన॥ నేనెడతానేడని మాటలేడ-స్థాణుండనా మోడుతా బ్రహ్మచ
ర్య-మేణాయతాక్షి.మున్నెన్న డెరుంగు - నాచుబో బ్రహ్మచర్యవ్రతం బే
మిశేజేయునోపార్వతిచంగటనున్న॥

శ్లోకం॥సంతుపిలోకనభాషణవిలాసపరిహాసకేళీపరిరంభా।స్మరణ
మపికామినీనామలమిహమానసోపి కారాయ॥ అనుటవలన॥ అరిమురిజే
యుమదాగ్రహంబునకు-సారదినహింసదోచునెమాట లేల। తరుణితృష్ణా
యసత్యములనుశక్తు-లిరువురేచాలులింకేమిలోభంబు-వనితలందరుమన
వారలుగారే-మునితపంబులుభంగములుజేయ లేదే॥

శ్లోకం॥ప్రభవతిమనసివివేకోవిదుషామపిశాస్త్రసంభవస్తావత్।ని
పతంతిదృష్టివిశిఖాయవన్నెందీవరేక్షణా॥అనుటవలన॥తవిలినామంత్రియ
ధర్మ డొక్కరుడె-భువనత్రయంబులిప్పుడుముంచగలడు-పరికింపబ్రహ్మాండ
భాండంబులందు-కరియాననేనెరుంగని దేమిగలదు॥

శ్లోకం॥రమ్యంహర్మ్యతలంనవాస్సునయనాగుంజద్విరేఫారదాః।
పోత్రిన్మీలంనవమల్లి కాస్సురభయోఃవాతాస్సచద్రాక్షపాః॥యద్యేతానిజ
యంతిహంతవరితశ్ స్త్రాణ్యామోఘానీమే । తదోబ్బఃక్వెదృగసౌవివేకహృద
యఃకీదృక్ప్రబోధోదయః॥అనుటవలన॥ రాజకీయములకు రాగొరమాలె।
నోజితేంద్రియుడాయనోబయల్పడునె।భూమిపై నొక్కధూతానసైక।తా
మసీతపియంత తామసిగాడె॥

శ్లోకం॥ సహజమలినవక్రభావభాజాంభవతి భవప్రభవాత్మనాశహే
తుః। జలధరధరిపినుపాటభూమాజ్వలనపినాశమనుప్రయాతినాశం॥ అ

నుటవలన-లోకస్తుడై మాయలోబడి యోగి। పోకలలోకులముంచదలచె। నరిమురి వాని నెయ్యంబు నెయ్యంబె। పర మేశుభమ్మునాబల మెంత కెంత-

శ్లో॥ అహల్యాయైజారసురపతిరభూదాత్మతనయాం ప్రజానాదోయాశీదభజతగురోరిందురబలాం। యితిప్రాయఃకోమునసధముపదైశాన్యతమయాశమోహమద్బాణానాంకఇవభువనోన్మాదవిదుషః॥ అనుటవలన। ఇన్ని విధంబులనింపొందుచున్న। నన్ను బయలప నెంతటివాడుశివుడు। ముగ్గోవులీక్రోధముఖ్యులెవరును। లగ్గయిననా వెన్కలనేయున్నవారు। గావుననే డందుగదలి నేబోయి। యేవిధంబుననైనసీశ్వరీశివుల। నొక్కటిజేతునిందుండుముసీవు। టక్కలిదీపించు మేలగునతివా॥ అనినరితియిట్లనియె॥ సుగంధివృత్తము॥ సకదలోకభాసనలోకనాథనైనజీవనా। చకితహృద్వవిధవిచారజారకోటిభావనా। శుకపికభ్రమరమిరాపసుప్రజాభిసేవనా। నుతరయిందు కూరిపేటసూనబాణపాపినూత్రి। నినుదలంచిమనసనిల్ప నేరనేమిసేతుమా। ననుదయారసమున దెల్చినావనెపుడుజూతుసు। మనుసుదీర బెనగకెటుమంతనం బెసైతుదు। యనుదినంబుసిన్ను విడువనయ్యప్రాణనాయకా॥

నిరుపమానచతురదివ్యనిత్యకీర్తికోటిభాస్కరా। శశాంకబహుజగత్ప్రికాంతమూలకందభాసురా। చరితసకలభువనశోకనాశపాయక। స్ఫురితయిందుకూరిపేటపుష్పబాణపాహిమాం॥ 3॥

ఇపుడెనిన్ను శివుని బాగికింద్రుడేలబంచెనో। కపటశంకరుండుమ రేమిగామదిందలంచెనో। యెపుడునిన్ను విడువనంచు నిప్పుడేత్రిశుద్ధిగా। శబ్దమియ్యవయ్యజన్మజన్మమునకుమన్మథా॥ ౪॥

కమలపత్ర విమలనేత్ర శౌర్యద్యువాసవా। సమిధరీనివహాతైకభండగండభైరవా। శ్రమనిదూరసకలభూప్రజామనోంబుజాసవా। ప్రభువుయిందుకూరిపేట పంచబాణపాహిమాం॥ ౫॥ వ॥ బాణినాయకా నీవదేవ చెవునిజయింపబోవుచు నన్నింటికడనుండుమాటివినేనుంగూడవచ్చెదననిరానియ్యకొనక తనమంత్రియగు వసంతునింజూచి.

సీ॥ కమలషండమునున్నగా జేసియిగుసుగా గావించి కెలదమ్మి గండ్లుగూర్చి। తగనించుమోసలునొగలుగాగావించికర మొప్పగేదంగిగాడిబెట్టి। సంపంగిమొగ్గలుగనుగొయ్యలమరించి పల్లవంబులుమీదపరువుజేసి। చెలువొందపొగడదండలనంటబిగియించి లేదీగెపలుపులులీలకొన్పి। తెరవుమెరయపుష్పతేనెకంటున బెట్టి గండురాజకీరగణముగట్టి। మెరధాశపుగొడుగు మీనుటెక్కంబొప్ప తెమ్మనిన్నదన్ని తమ్మనిరథీ॥

వ॥ అనిచెప్పినవినివసుతుండట్లు తేరాయత్తంబు జేసి తెచ్చినంజూచి రతీదేవితో నిట్లనియె. అన్యదేశ్యముదరువు హిందుస్తాని కాఫి-ఆది.

పోవలెపార్దాయనే చెలి హా సావకాశ మాయెంగదే చెలి-ననుదీవించి పంపించవే చెలి పోజయము భీకయ ఘనిజయమని ప్రయాణముం జేయవే చే పో భాసురాంగి మనయొకరినొకరి యెడబాసియుండుమట నే॥ చె॥ పో॥ ఇందుమారి పేటేమే మోహనిపం దేహమునొందకే॥ చె॥ పో॥ వ॥ అనినమంత్రితో నిట్లనియె. మహాదేవునిజయించుటకు సహాయంబుగా బాలకోకిలంబులుపల్లలదఛత్రంబులుబట్ట నెరులులాడియళులువాడుపారావతాదులు భేరీమృరంగాదివాద్యంబులు జేయభారద్వాజంబులుపరాకులు జెప్ప చాతకచకోరాదులుయశంబుపొగడ కీరంబులు కైవారంబులు సేయ కలహంసకాగణంబులు మార్గంబులు జెప్పయు ద్యానవనములపుష్పవర్షంబుగురియ శృంగారంబుబొంగారగమ్మగాలివీవమీను టెక్కెంబును మెసలిపిండెంబును కమ్మవిల్లునిపువ్వుటమ్మును సిద్ధంబు జేయుమనిననతరుడట్లుజేసె. నంతంగందురతి కాంతజింతించుటం జేసియంతో మోదంబునం దోడ్కొనిసిపులీగవయనగంబులు జెలగ సమరసన్నాహంబు జేసి రథారోహణంబు జేయుచునిట్లని.

దరువు. నాటరాగం-ఆదితాళం.

దాక కాపదరాక యిలా సముదారిదివ్యగదరా॥ బారకతపననివారకపల్లపపూరక సమయోత్తారక దారక! దా॥ కలకంఠంబులకలహంసలశుకములనిళికులములరమ్మని॥ దా॥ తియ్యనివిలు వెన్ని యెక్కయ్యము నాకును చయ్యనరమ్మని॥ దా॥ యింమకూరి పేశ్చేలుశివుని ఘనమందర మొక్కలైయని బోరిగొనవలె॥ దా॥ అని కాముండు సమరసన్నాహి రాముండయి గాజితా। చలవాయణో ద్వేజితార్థంబు కైలాసంబు నకేతెంచిముక్కంటిన క్కడంగానకగామ్యకవనంబుననున్న వాడని వెదకుచుంబోయిపోయి నులన మహామదగజేంద్రోత్తముండుముందటనిదురపోయినసింహంబు శేవనిర్వారదీపంబు కరణిని స్తరంగ సముద్రంబుపోల్కి మధ్యందినకోటిమార్తాండలమండలనన్నిభుండై యున్న పరమేశ్వరుంగనిపార్వతిసిక్షించిపూజాసమయంబని కట్టుబట్టల నట్టిట్టుచుట్టుముట్టినరట్టడికి గట్టుపట్టియట్టిట్టుజూతనగుట్టు జెరువనకాయసిజుట్టు కైదువబట్టు నానివట్టితో బెట్టిదంబుగాడట్టులనియె॥

దరువు. హిందూస్తాని-వరాళి-ఆదితాళం

మారా రారాటుపోపో రారారాపోపోరా॥ మా॥ తారతమ్య మెరుంగక కేరికేరి వచ్చేవు॥ మా॥ [illegible] నసరకొసరి నాపై

విసరివిసరి వేసేవు॥ మా॥ జారిణిసాలను జేరినకై వడి గొరకమానను కదసివచ్చే వు॥మా॥సారెకునిందుకూరిపేటముందు జేరగనేకదచెంగిచెంగి పైకొందువు॥

సీ॥ కరమునిష్కారణాగ్రహమువాటించుట సాత్యవాక్కులనమర్షత యుగనుట। భావింపమధుమత్తతావిశేషంబనగదా పాంథజరసంతాపకరణ। గాకున్ననిటుపర గాలిపై నెక్కి జులాయింపుదువోతగులావుదక్కి । తరుల నుండెడు శకుంతములకుపనులు జెప్పుదువో దేహము మరచుదువొమిగుల॥ నారనాపైక్రూరమిదేమిర । అంతకంతకు నొగ్గలమాయగదర । శివునిబూ జించిశుష్కించిచిక్కినార । భళిరశుకరాజకంఖాణ పంచబాణ॥.

దరువు. కాంభోజి - రూపకతాళం.

పసిదానర కసిమానర వోమీనకేతనా॥ ప॥ సూనబాణనే పెండ్లిగాని దానరవియ్యానర॥ ప॥ హటముమానర యింతాకఠినమేలరా - పెళిల్లుంపెటి ల్లుమని శరములుమెన్ను రమవయించుర॥ ప॥ తాళజాలరా మందెమేళమే లరా - బాళీనిలుపలేకశంభుని బారిగోరియనైతిరా॥ ప॥ చేటుదెలియవేమి సేయగలవుదాటిజూపెద-విందుకూరిపేట శివునిజూడవు॥ పసి॥

వ॥ అనిన మన్మధుండిట్లనియె.

ఉత్పలమాలార్ధము. ఓవిరీరాజపుత్రి శరణాజన యిత్రిమహాపవిత్రి నేడిగుణహీనుడీ । కఠినుడిచ్చటలింగమైత్వది యాగమనంబెరింగియు మహా మునికైవడి । నున్నాడునాయోగముచూడు మీశివునియుగ్రతపంబడగించి నీపయినుంచి। రాగాలీనునిగావింతు వియోగాటోపము బాపుదుసంయోగా నందముజూపుదునే యెలనాగ॥ బాగాయనునీభావంబెరుగని మూగవాని పై మోహంబేటికి॥ రా॥

వ. అనితననైజస్వభావంబు పార్వతికెరింగించి భవునుద్దేశించిమనో భవుండు కేరుచునిట్లనియె.

దరువు. ధన్యాసి- అటతాళము.

పలుకవదేమి దేవుడా శివుడాశివుడా॥ ప॥ భువనమోహిని పచ్చనిపొం దంగోరినమెచ్చితవిలి - పొందంకడచ్చిమునివై సాధురూపంబందితివి॥పలు॥ పాడుయోగముబూని నాడవే మోగాని - జూడుమిదిగోనేడు నీజపమేడనో తపమేడనో॥ప॥ వాహువీహుగారువలరాజు నాపేరుతారతమ్య - మెరుగవిది గంభీరమాసింగారమా॥ప॥ ఓరోరినేనిందుకూరి పేటకుముందుచేరి - గౌరిం జేరిసంస్మృతికూరిమిట్లుగూర్తునని॥ ప॥

వ. అని మరియును.

మ. విలుజూచుఁ వెలిజూచిసురలఁ విశ్వేశ్వరుంజూచుకొం । దల మందుఁదలపోయజొచ్చు కడిమిందర్వోకరాలంకృతో । జ్వలవిభ్రాజితజిత్వ నిర్ఘణ పోవారాన్నిధిఁ జెచ్చెరఁ । గలపఁజూచు గలంపలేకదలచుఁ గా ముందునిచ్ఛాభ్రష్టుడై॥

వ.మరియుమరలధైర్యంబవలంబించి తపసి బెంపుసొంపు నందరుజూచు నటులజలింపక సకలబలపరీవృతుండై యించుకనిదురబోవ పంచాననంబు నందందమేలుకొల్పుగంధ సింధురంబుపోలికమదనుండు పంచవదనుండాసిన॥

క. అంతశివార్చనసేయుం, గాంతాతిలకంబుశైల కన్యయవచ్చెఁ, కంతునిదీమె మాయనగ, నెంతయులావణ్యమొప్ప నీశ్వరుకడకున్.

వ. ఇట్లువచ్చి,

ఉ॥ కాయజనిగ్రహాయశశి ఖండధరాయనమశ్శివాయకా। లాయ హారాయభీషణబలాయ కపాలధరాయ దేవ రె। వాయమునీంద్రయోగివర దాయజగద్గురవేన్న మోన్నమో। పావకలోచనాయ బహుబంధహరాయ భుజంగభూషణా॥

శివాయగురువేన్నమః॥ నానావిధప్రత్యక్ష ప్రసన్నదివ్య మంగళనీ రాంజనంపరికల్పయామి॥

మంగళహారతి. సురట-అటతాళం.

అఖిలాండకోటి బ్రహ్మాండనాయక - జయమంగళం శుభమంగళం॥ సుఖసాగరభవ్య సుగుణాకరదివ్య॥ మంగ॥ నారదాదిమానీతనగానవిలోల॥ మంగ॥పారావారగంభీర పరమార్ధవిచార॥ మంగ॥ కమనీయపరతత్వకైలాస విహార॥ మం॥ రమణీయతోకాంతరం'వృషభతురంగ॥ మం॥ రాజరాజభిహి తాభిరామువైరివిమా॥మం॥ రాజావతంస నిర్మలమానసంహార॥మం॥ నారా యణాదిబృందారకవందిత॥ మం॥ కారుణ్యాకరయిందుకూరిపేటమహేశ॥మం॥

శివాయగురవేన్నమః॥ ఛత్రాదినానావిధోపచారాన్ సమర్పయామి॥

వ॥ అనుచున్న సమయంబున,

క॥ గిరినందనడాయంజని । అరవిరులం బూజసేయు న త్తరిమాళిఁ। గిరిజకరంభులుసోకిన । బరమేశ్వరుచిత్తమెల్ల బరిపనియయ్యెన్॥

వ. ఆసమయంబున,

శా॥ ఠంకారధ్వనినింగినిండవెడలింపఁ పువ్వుబాణంబుని । శ్శంకం బూన్చిసురేంద్రుకిచ్చిన ప్రతిజ్ఞాసిద్ధిగాజేసివా । గిఁకర్ణవిల్ దెగవాపిగౌరి శివుకేఁగేలెత్తిబూజించునో। హుంకారించుచు దీశునేసెమదనుండుజృంభ

సంరంభుఘు బయి॥

వ॥ ఎట్లెనంటి శేని.

పంచచామరము॥ సదామదీయ దివ్యపుష్ప సాయకంబులొక్కటన్। మదేభయానలీవసంత మందమారుతంబుసూటౌ । పదంబులీశుకాళిసంద్రపైకముల్ గడంగిని । స్నదల్చిచుట్టిముట్టిగెల్వ సద్దమేమిశంకరా॥

వ॥ అని ప్రథమతూణీరంబునైచి,

పంచచామరము॥ సరోజసంభవుండుజక్క చంద్రుడుడుక్కదక్కసోప్పురందరుడుసృక్కనింక భూసభోంతరంబునన్ । బరస్పరంబు లెంచనేల ప్రజ్ఞలేమి జేయునీ । నిరామయైకనిష్టనిల్వ నేరదింకశంకరా॥

వ॥ అని రెండవకాండంబుబరపి,

పంచచామరము॥ కఠోరలింగమూర్తిపై ప్రకాశమందునీపయిన్। హరంబెయొండుబూనిమాని వైదువాడితూపు ప్రన్। గటిల్ గటిల్ గటిల్లనంగకార్ముకంబుబూనిహుం। పెటిల్ పెటిల్ పెటిల్లినంద బేర్చినైతుశంకరా॥

వ॥ అనికడుంగెరలిపోరలి మరల శివుంగాఢనేసి,

పంచచామరము॥ జగద్భయరికరాట్టహాస ఘంచభంపనంబుదిగ్గి । గంతశాళ పూరితోరు తీవ్రముగార్ముకార్భటిన్। ధ్ధగధ్ధగధ్ధగాయమాన దాసపానకాకృతిన్। యుగాంతలీలజేసిడాసి యుక్కడంతుశంకరా॥

క॥ మదనుం జేసినబాణము । హృదయంబునగాడిపార నుగ్రుడుదన్నన్। బెదరించినెవ్వడోకడు। మదమత్తుడు ఘోరదుష్టమానసుడగుచున్॥

వ॥ అని కించత్కంచుకితమానసుండై తనమనంబు గగుర్పాటునొందియున్నసమయంబున మహుండు మరల నిట్లనియె.

పంచచామరము॥ నకామినైతి వేనివచ్చి శైలకన్యనేలుమో। వికామినైతివేనిమోగ తత్వవిత్వవృత్తినుండుమీ। సకామివో వికామివో ప్రసంగమేమిలేకయిం। దుకూరిపేటనుందువెంత దొంగవీవుశంకరా।

క॥ వేసినయంతటదనియక। భాసిలివెండియునుపుష్ప బాణమునారిన్। బోసినమానససంభవు। నీశుడుగనువిచ్చిచూచెనెవ్వడోయనుచున్॥

వ॥ ఇట్లుజూచిన,

మ॥ కులశైలంబులుభేగలన్ జలనిధుల్ కోలాహలంబై వెసన్ । గలగన్ దిక్కులు ఘూర్ణిలన్ జగములా కంపింపవిశ్వంబరా । తలమల్లాడనభస్తలింగరుడగం ధర్వామరాధీశ్వరుల్ । పలుమాడుంబెగడొందజుక్కగురులన్ బ్రహ్మాండమముల్ భీతిలన్॥

క. భుగభుగమని పెక్కుమంటలు। భగభగమనిమండుసంత బ్రహ్మాండంబుల్ ।దిగదిగులదిగులుదిగులన । తెగిమరుపైచిచ్చుకన్ను దేవుడువిచ్చెన్॥

వ. ఇట్లువిచ్చిన,

సీ॥ కలహంసములతోడ గండుకోవెలలతో మేలైనగమ్మతెమ్మెరలతోడ । చిలుకలగములతోనలరుల తేరితో శరముబూన్చినశరాశనముతోడ। పుష్పహారములతో పుష్పశాస్త్రములతో దనరారుమకరకేతనముతోడ। పువ్వులజోడుతో పువ్వులదోనలతో కొమరారుచిగురాకు గొడుగుతోడ॥ మరియుదక్కినట్టి మహితశృంగారంబు। తోడగూడివేగదూలితూలి ! శివునినుదుటికంటిచిచ్చుచేనుడిబడి। పచ్చవింటిజోడుభస్మమయ్యె॥

వ॥ నయ్యవసరంబున ఫాలలోచనభీలనాపక కరాలజ్వాలావలీ పాలితభస్మీభూతుడైన చేతోజాతుండు తెగురుంగనుంగొని విస్మయాకులచిత్తయై యతనిసతియైనరతీదేవి ఝల్లనునుల్లంబు నల్లటిల్లనల్లనంబోయి మూర్ఛిల్లి అల్లనదెలివొంది శోకమల్లీమునిందికలంగుచు దొలంగరానిబహువగలపాలైదూలుచు వదనంబునుశిరంబును వదనగహారంబును మోదుకొనుచు నేడ్చుచు మదనుండుపోయిన నోలికడాయింబోయి యిట్లనివిలపించె.

ఉ॥ హావలరాజహామదన హాదియరాయతచానులోచనా । హావిటలోకమానసనిరంతరతాపభవత్ప్రతాప । హావనజాతనేత్ర తనయాయెటుజోతివిగానరావుసం । సేవితమైవనీబలము చెల్వాముమంటలలోనడాగెనే॥

శా॥ కట్టాదేవరకంటిమంటలునినుర్గారించుబోమన్మథా।చుట్టాలందరిదంద్రులందలచితో శోకంబునంబొందిని । వెట్లుంబల్కితివోభయంపడితివో యెంతేనిజింతించినే । డెట్లుంబోనగనునీఘటనలకునై యేమంటివోమన్మథా॥

దరువు. పున్నాగవరాళి - అటతాళము

ప్రాణనాధా।ప్రాణనాధా బాపురెనా।ప్రాణనాధా. జీవితేశా।జీవితేశా అయ్యయ్యోనాజీవితేశా॥ పంచబాణపంచబాణ అయ్యయ్యొ నాపంచబాణ॥ మోహనాంగ మోహనాంగ అయ్యయ్యోనా మోహనాంగ॥ యిందుకూరిపేటభవుయింతాజేసెనెసుగానిపుడు॥ప్రా॥

వ॥ అనిమఱియునిట్లని వితర్కించెను.

సీ॥ పోరిపాంపుఖానుపుంకంబులైతాకు పుష్పబాణంబులెందు బోయెనేడు। యీ రేడుజగముల నేవుమైమరగించు కడిమియెచ్చటగూల్చి కాలెనేడు । కాముకవ్రాతంబుగర్వంబుగబలిచు ఠంకారరవమెందుదాగెనేడు । విటులగుండెలలోనవివశించుచిగురాకు సంబెటిద్రవేటెందుసమసెనేడు । నేడు

నిన్నుగానసీవెందుబోతివి। ప్రాణనాథనన్ను బాయదగునె। విరహాచిత్తచోర విఖ్యాతసుకుమార। అమరశైలధీర హరికుమార॥ వ॥ ఇదియునుగాక,

సీ॥ ఉచితమార్గంబు లనుపలాలనము జేరి యిపుడురక్షించువా రెవ్వరింక। అటవారలిటవీర లయ్యేడుగడలునై యిప్రుడునన్నేలువా రెవ్వరింక, లీలనర్థించిన లేదనికసరక యిష్టంబులిచ్చువా రెవ్వరింక। కర్ణంబులకునింపుగానిష్టవాక్యంబు లిప్పుడు జెప్పువా రెవ్వరింక॥ నేడునాథనీవు నీరైనపిమ్మట। రివిరినన్నుగావ దిక్కులేక। తలచి తలచియేడ్వ తగవైచె నక్కట। సింహిజనకళత్ర విష్ణుపుత్ర॥ వ॥ మరియు,

ఉ॥ నినువేషంగుల వాయజాలపనితా నిశ్చేద మింతేనియుఁ। మన ప్రాణంబులు రెండుఁయొక్కటిసుమీనారీమణీనమ్ముమీ।యనినాకిచ్చినబాసలన్నియునుకెల్లయ్యెగదాలక్ష్మీనం। దనయెవ్వారికి నయినదైవఘటనల్ దప్పింపగావచ్చునే॥ వ॥ అనిమరియు నిట్లనియె.

దరువు. శోకవరాళి-అటతాళము.

అయ్యయోమదన యేమందు నేమందునో॥ ప్రా॥ అయ్యయో యెటుబోతివన్యాయమైపోతి॥ ప్రా॥ శివునిబోరాడి గెల్చినవా రెవరు॥ ప్రా॥ యవ రేమి జేతురింకేషనినుజూతు॥ ప్రా॥ కోరమాలెపోతినెవ్వరి దానపోదు॥ ప్రా॥ పరికింపనాపూజఫలమింతెబోలు॥ ప్రా॥ పతిలేనిసతినైనే బ్రతికియెన్నాళ్లుందు॥ ప్రా॥ క్షితిపైనినీవెంటనే మృతిబొందలేనైతి॥ ప్రా॥ వ॥ అని,

ఉ॥ అరిమురిచిన్నాడుచెలు లందఱుగొల్వగగూడి యాడనీ। చిరుతది పుణ్యకాంతయని చేతుస్రాతలు జూచిపెద్దలే మెరుగుదుమంచుచెప్పుటలు యంతయు తథ్యముగాకపోయెనో। అరిగురీదప్పెనా విధీపనై విలపించుటదెల్ల మాయనో॥ దర్వు. యిందు కూరిపేటాధీశ విషమాయే॥ ప్రా॥ కుంఠీకృశించినేనెందుబోదునయ్యయ్యో॥ ప్రా॥

వ॥ అని సభాసదులజూచి యిట్లనియె.

సీ॥ పురుషభిక్షము బెట్టిపుణ్యంబు జేయ రే తపము జేయునట్టితపసులార। ధర్మమెంతయు భర్తదానంబు జేయ రే దివినున్న యింద్రాదిదివిజులార। నా వల్లభునిదెచ్చినన్ను మన్నించ రే తలలెత్తిచూచు గంధర్వులార। దిక్కుమాలినదానిదిక్కైన చూడ రే ధర్మమానసులగు తండ్రులార॥ అమర శరణంబు వేడెదనన్నలార। వల్లభుని గొల్లబోతినే జెల్లనకట। కరుణగానగనింక మెవ్వారు నులేరు। పుణ్యమయ్యమొరాలించిబ్రోవరయ్య। వ॥ ఇదియునుంగాక,

ఉ॥ తల్లులు పుణ్యగేహినులు తండ్రులు పుణ్యజనంబు లంచునా।యుల్లమ్ము

నందునేదలతునోసురగేహినులారమీరునా। తల్లులునేనుగూతురనుధర్మమునో
ములదాననైతినీ। యల్లునిచ్చినన్మరలనైదునజేయరెమీకుమ్రొక్కెదన్॥

క॥ అనివిలపించుచు గుందుచు। తనచేరువనున్నయట్టి తాపసవర్యున్।
దననాథనీశుగనుగొను। మనిశోకాక్రాంతయగుచుగన్నియ బలికెన్॥

దరువు. అసావేరి అటతాళము.

ఈలాగునజేయనేలా నీమంచిమేలాయన శంకరా - బాలేందుమకుట
నీబారి గౌరియలమైతి॥ మేలాగుచేసినా యికజేయవచ్చునీ మ్రోలనన్నున్
గాలుపన్ దగునాను- మొగడొకడేలాగుగూలిన మేలుసహాగ మనంబుజేయక
లోలతడంబడజాలనయ్యయో॥ ఈ॥ పాపిష్టింద్రుడుమమ్మీ పనికిబంపించితానే
పాటివర్ధిల్లునో- నాపట్టిమృతిబొందినాడు హాయనియెంతవాపోవునో పెద్దవాడు
మామయేపాపమెరుగనిమమ్ముమాపసికాపురము భంగంబుజేసిన పాపకారి
శివాయిదేమి నిరాపధులమైతిమయ్యయో॥ ఈ॥ నావంటి ముగ్ధాంగినిటుముం
డమోయుటచే వానికాదాయమా నీవెతలిదండ్రి గురుదైవములనినమ్మిజీవి
తేశునిబట్టినీవాతబెట్టి నానావిధంబులజెడితినయ్యయో విధిందలపోయనేటికి
నీవుజేసిన ముండనైయేత్రోవన్ బోదునోశివశివ॥ ఈ॥ అకటపార్వతికినికను
సంధానము జేయుటకువచ్చింద న్యాయమా యికనేమున్నదిచ్చోట యిందు
కూరిపేటనొకరైన మమ్ముజూడక పల్కకున్నారు వికటదుస్సహామతివి హిం
సావిషయమింక మానవైతివి తింకమకంబడజేసితివి భువిపకపకలు వికవికలు
గామమ్మీలాగున జేయ॥ ఈ॥

వ॥ అని యిట్లు రతికాంతనికాంత చింతాక్రాంతయై యేడ్చుచున్న
సమయంబున కంతునిచెలికాడు వసంతుడిట్లు విలపింపందొడంగె.

ఉ॥ సంగతితోడ నావలచు జాణుడు బాంధజనోపకూరినా। సంగడి
కాడునావలచు చక్కనివాడిటుదేవతార్థమీ। జంగముమీదవచ్చిబలుసంపద
నాతనకంటిమంటచేసి। సంగరభూమిలోమడిసిచయ్యనదేహముబాసెనక్కట॥

వ॥ ఇంతటమున్ను పుడమిపై బొడమిన నాటనుండి మేమిరువురము
జీవితాజీవంబుగానుంటిమిఘడియయైన నెడపడక నెడబాసితడవాయె నింతలో
జగదేకమోహితుండైన స్నేహితుండు ముక్కంటి మంటలవలన గ్రాగికాలి
నేలగూలిన దిక్కెడనేనాఅనుచువచ్చిన యామగనితోరతి భామయిట్లనియె.

సీ॥ పరమేశు డనియెడి పడమటి కొండపై కుసుమ బాణార్కుండు
గ్రుంకునేడు। గౌరీశుడనియెడుగంభీరవార్ధిలో నరుగమన్మథ కలంబవిసెనేడు।
ఫాలాక్షుడనియెడు బడబానలములలోనకందర్ప కాంభోధిగ్రాగెనేడు। మల

హారుడనియెడు మహహితమార్తాండు చేరుడనాంధకారంబు గ్రమంచెనేడు॥
నేడుమునులదపమునిష్కళంకతనొందె। నేడుయతులమనము నిక్కమయ్యె।
నేడుజగము లెల్లనిర్మలాత్మక మయ్యె। యేమిజేయనేర్తు యెందుజొత్తు॥

వ॥ అని మరియును,

దరువు. మిశ్రమజాతిస్వరం,

ఏమిసేతుయేమిసేతు నెటులసైతుసురభి నామనోహారుడు మృతుడై
నాడయ్యయోసురభి॥ ఏ॥ నన్నేలినసామినినేనెన్నడుజూతునుసురభి - కన్నుల
ముందరనిలచి యున్నట్లున్నదిసురభి॥ ఏ॥ పసికాపురమనక శివుడు భంగపరచె
సురభి-విసువకయీజన్మ మెట్లావేగింతునోసురభి॥ ఏ॥ చేసినవారికి చేసినంత
విసగబోదుసురభి - వ్రాసినవ్రాలుదుడిచి వేసెవారెవ్వరు సురభీ॥ ఏ॥ భగ
వంతునికనులు చల్లబడెగదోయి సురభి - పగవారలకైన యీసద్దవలదయ్య
సురభి॥ ఏ॥ ముందువెనకదోచదు నెందుబోదుసురభి - యిందుకూరిపేటకు
వచ్చిందిందుకటోయిసురభి॥ ఏ॥ వ॥ అనిమరియును,

గీ॥ ప్రాణనాధుబాసి ప్రాణంబు నిలువదు। పోవగలదుదావ బోవ
కున్న। సురభియింకనీవు సొదజేర్చవేవేగ। చిచ్చుజొత్తుకాము జేరవలసి॥

వ॥ ఇదియునుంగాక,

క॥ అనలముఖంబు నసతులకు। ననుగమనము జేసిదివికి నధిపుడుదా
నుగ। జనుట మహాధర్మంబని। వినుపించెదు బుధులమాట విననెవసంతా॥

వ॥ అనుచున్నసమయంబున నశరీరవాణి యిట్లనియె.

ఉ॥ ఏలమృగాక్షినాపలుకులేటికి నమ్మవుకూలిగొండరా। మాలివివా
హామైనయెడ శోభనమంగళవృత్తినున్నచో। వెలుపులెల్ల నంగజుడువేగుట
జెప్పినకామునిచ్చునా।నీలగళాంకుడివ్విధమునిక్కమునిక్కమంగనా॥

వ॥ అనిపలికినవిని యాకాశవాణిమాట లాలించవమ్మారతి అనినవసం
తునితో రతిదేవి యిట్లనియె.

ఉ॥ యెచ్చట నుండి యిందుధరు డెప్పుడుపార్వతి గూడుకూడెనో।
యిచ్చు నెమన్మధుందివిజు లెప్పుడుజెప్పుదు రిట్టివాక్యముల్। మెచ్చునెలోక
ముల్వినిన మెత్తురెధాత్రినిం జచ్చినవారువొత్తురే। జెచ్చెరలేటికిట్టి బయలు
చెప్పినమాటలు నమ్మవచ్చునే॥

వ॥ అనినవిని వసంతుండు రతీకాంతనుజూచి యిట్లనియె.

క॥ మింటన శరీరమరియును। దొంటివిధంబుననె బల్కు తోయజ
నేత్రీ। వింటేనీనాయకుడే। వెంటను మలరంగవచ్చు వినుములతాంగీ॥

వ॥ అనిన రతీకాంత వసంతునితో నిట్లనియె.

గీ॥ నేడి దెవింతలో వింతనిది కొంత। చింతనీవింత జెప్పెద వంతకింత। యింతకంతకె దడనాయె నెందునకట। గగనభారతిమాట లెక్కడినితంబు॥

వ॥ అనుచున్న సమయంబున నీశ్వరుండు తనమనంబున రతీపార్వతుల వలననేమిశాపంబులుగలుగునోయనియదృశ్యుండై కైలాసంబునకుఁజనియె. అయ్యెడ రతియిట్లనియె.

ఉ॥ ఏలదురాశబోవిడువు నెన్నిదెరంగులనైనశోకదుః। ఖాలసచిత్తనై విధవనై గతి మారినదీనురాలినై। దూలుచునిచ్చలుంమగనిదుస్థితిబొందగ జాలపావకః జ్వాలలుజొచ్చినాహృదయ వల్లభుమన్మథున పోయెదన్॥

వ॥ అనుచున్నసమయంబున ఆకాశవాణి క్రమ్మరిట్లనియె.

ద్విపద॥ ఓకొమ్మయోకొమ్మ యోముద్దుగుమ్మ - నీకేలచింత లన్నియుమానవమ్మ - సరవినుమామ హేశ్వరులకుపొందు - జరుపనకాదెయచ్చటికితొలిదొల్త - పాకారికాంతుబంచెపంచినను- యాకడమృతిబొందె నికనీదుమగడు-పరలోకగతుడైనపద్ధతిజూడ-తిరుగబుట్టుటకుమృతిన్ బొందని-తిరిగిరానట్టిమృతిన్ బొందలేదు-పురుషచూత్రముఖ్యులుపురవైరిజేరి - శరణంబువేడితత్క్షణమెనీయగని - మరలబుట్టింతు రమ్మాయింతలోన - శంబరాసురుని దాన్యంబొందుదక్క-కంబుకంధరినీకు గష్టంబులేదు - అనుచూరిసుబ్బరాయుండాదిన్నైన-జనుల కానంద మొసంగదలంచి - పరమేశ్వడుబరాత్పరుడుశంకరుడు-సురుల మొరాలించి శుభముదలంచి- తనకుజేసినమేలుదలపోసిగదశె- మనలోకములకు గామినిలేమివలని-హానిదలంచి దయ్యనబుట్టజేయు -కానివేమారడింకాచింతలేల-నలివేణినిత్యముల్హైదువుగాని -దలపోయనీకు వైధవ్యంబులేదు- వలరాజుమరలనీవల్లభుడౌ౼ - కలికినిక్కంబు నిక్కంబు నిక్కంబు పల్లవపాణి శుభంబుశుభంబు - కల్లగాదమ్మనే గగనభారతిని - బలికితినిందేమబద్ధంబులేదు - యెలనాగనీవు మీయింటికిబొమ్ము॥

వ॥ అనిన రతీదేవి వసంతునితో నిట్లనియె. నన్నీప్రకారంబున వైకుంఠపురంబున కేగుమంటిరి ప్రాణనాథుండులేనినాడు దేహంబుభస్మంబు సేయక నాదొక జన్మంబని మానహీనురాలనయి నేను మా యింటికింబోను.

దరువు. హిందుస్తానికాపి.

యెటుబోదు యెటుబోదుసఖి॥ ఎ॥ కటకటాయుపేంద్రు డెంతగాశిబొందెనో - తటిమటిందిశిరివిని యేమి తల్లడపడునో॥ ఎ॥ బాపురేసుఖించ

యెవరిపంచబ్రాకుడునో - పాపకారివిధికి నేనేపాపముజేసితినో॥ ఎ॥ మా
సమ్మందంబైన వారెన్నిమాటలాడెదరో - నాసరిసమానులేమని నవ్వులు
నవ్వెదరో॥ ఎటు॥ యిందుకూరిపేటకు శివుడెన్నడుజేరునో - కందునియి
కెన్నడు నాకన్నులజూతునో॥ ఎటు॥

వ॥ ఆకాశవాణిమాట లధికంబులని నీవు దలంతువు, నేను నమ్మ
జాలనని యింటికిబోవనిచ్ఛగించియు నిచ్చదీరకయున్న రతీదేవి ననేకభంగుల
నూరడించి వసంతుండు బనుప నత్యంతవిహ్వాలంబున,

క॥ సతతంబునతులవేదన । మతిబొందుచుహృదయకమల మధ్యము
నందున్। పతితలచిచింతచేయుచు। రతసతివ ర్తించెనొండురతిలేనిగతిన్॥

వ॥ అంత నయ్యవసరంబున పార్వతి యిట్లనియె.

క॥ మనమాటలువినిశంభుడు। తనమదినీక్షించి శోకతప్తాకులుడై ।
తనునేమిదిట్టునోయని। చనియెన్ శీఘ్రమునరజత శైలము జేరన్॥

వ॥ అని మరియు తనసఖులతో యిట్లనియె.

దరువు. నీలాంబరి-రూపకతాళము.

తెలియకనే మోసపోతిని వెనుకాముందుచెలియలలో చులకనైతినీ॥
తెలియకనే మోసపోతి చెలియలలోచులకనై తని కలకాలమునిందలుబడగల
నాబలలనామనవలెనా యిదికలనైనన్॥ తె॥ ఎంతపాపాత్మురాలను సామి
నాపైయింతపంతగించుటేలను-అంతటికింతాయెనింకాచింతించి కార్యమేమి
ప్రంతకారిమదనునిదాక సంతాపము కాంతాజన్మాంతరఫలమిం తేలని॥ తె॥
కోరినకోర్కె విఫలమాయెను నాసామినాపై కోపగించి చివ్వబోను-కోరికోరి
వలచివలచికోరమాలిపోతినిట్లా కోరినవారెవ్వరుభువిలేరా నాక్రూరగ్రహ
చారంబాకారాయిది॥ తె॥ యేమిసేతునేమిసేతును నాసామినిగకాయెన్న
డుజూతునెన్నడుజూతును - ప్రేమమీరియిందుకూరి పేటజేరియున్న వారి
నేమనికొనియాడుదునోభామిని ఈభూమినియింకామనిఫలమేమనిమది। తె॥

వ॥ అనుచున్న సమయంబున నక్కన్యకు మేనకాహిమవంతులిట్లనిరి.

ఉ॥ కామునిబిల్చి పెద్దయును గౌరవమొప్పగబుజ్జగించిను । త్రా
ముఢుశంభుపై బనుప దర్పకుడున్ జనుదెంచి వేయునో । సోమకళావతంసు
డును సృక్కకమూడవ కంటిచూపునన్ । గామునినీసుజేయుట జగంబుల
మ్రోసె నఖండకీర్తియై।

శా॥ అంత్రంగొండల రాజునెమ్మనములో నానార్తలాలించివే । సం
తాపంబున చిన్నబోయిమరితా సర్వేశ్వరుంగానక । త్యంతాందోళవిచార

